# నూతన ఇండియా రాజ్యాంగము ప్రజాప్రభుత్వ పద్ధతులు

నూతనఇండియారాజ్యాంగచట్టము భారతదేశములోని హైదరాబాదు, మైసూరు మున్నగు స్వదేశసంస్థానములను, మదరాసు, బొంబాయి మొదలగు రాష్ట్రములను కలిపి ఆంగ్లరాజప్రతినిధియగు గవర్నరు జనరలు క్రింద ఒక సంయుక్త రాజ్యాంగసమాఖ్య లేక "ఫెడరేషను" అనబడు కేంద్ర ప్రభుత్వమును స్థాపింపజూచుచున్నది. ఈ గవర్నరు జనరలిప్పటివలెనే ఇంగ్లాండులోని బ్రిటీషు సామ్రాజ్య పార్లమెంటు వారి మంత్రికి బాధ్యుడై వర్తించుచు, సర్వాధికారి యైయుండును. ఇతనికి కొన్ని విషయములందు సలహానిచ్చి సహాయముచేయుట కొకమంత్రిమండలియు, శాసనములను చేయుటకు రెండు శాసనసభలు నుండును. ఈఫెడరేషనులో చేరిన స్వదేశసంస్థానము లిప్పటివలెనే ఆయాసంస్థానాధిపతుల వలననే పరిపాలింపబడును. ఇందులో చేరిన మద్రాసు మొదలగు రాష్ట్రము లిప్పటివలెనే గవర్నరుల పరిపాలన క్రింద మంత్రిమండలులను, శాసనసభలను కలిగియుండి చట్టమునిర్ణయించిన రాష్ట్రీయస్వపరిపాలనమును అనుభవించును. ఈరాష్ట్రీయపరిపాలనములో ప్రజాప్రభుత్వ పద్ధతులెంతవరకు కలవో పరిశీలించుట యావసరము.

బ్రిటీషు సామ్రాజ్యములోని అధినివేశరాజ్యములగు కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా రాజ్యములందును, ఇంకను

మరికొన్ని రాజ్యభాగములందును బాధ్యతాయుత స్వపరిపాలనము అనబడు ప్రజాప్రభుత్వపద్ధతి అమలులోనున్నది. ఆదేశముల పరిపాలనకొరకు బ్రిటీషు పార్లమెంటువారు చేసిన రాజ్యాంగచట్టములను బట్టి ఆదేశములయొక్క ప్రభుత్వాధికారము ఇంగ్లాండుదేశ రాజగు బ్రిటిషు చక్రవర్తియందే నెలకొల్పబడి, ఆయనప్రతినిధియగు గవర్నరుజనరలు లేక గవర్నరువలన ప్రజాప్రతినిధులగు మంత్రుల సలహాసహాయములతో చలాయింపబడునట్లు శాసింపబడినది. ఆగవర్నరు జనరలు లేక గవర్నరులు అన్నిప్రభుత్వవ్యవహారములందును మంత్రులయొక్క సలహాసహాయములతోనే పరిపాలన చేయుదురు. ఇంగ్లాండుదేశ ప్రజాప్రభుత్వపద్ధతులను బట్టి ఈ మంత్రిమండలివారు ప్రజలెన్నుకొనిన ప్రతినిధులుగల శాసనసభలోని అధికసంఖ్యాకుల పక్షమునకుజెంది, తమచర్యలకెల్ల ఆశాసనసభకే బాధ్యులైయుండి శాసనసభవారి విశ్వాసమునకు పాత్రులైయున్నంత కాలమే పరిపాలనచేయుదురు. దేశమునకు గావలసిన శాసనములన్నిటిని శాసనసభలే శాసించును. రాజ్యాంగధర్మమును బట్టి దేశపరిపాలనమంతయు చక్రవర్తి పేరునను ఆతనిప్రతినిధియగు గవర్నరుజనరలు లేక గవర్నరుపేరునను జరుగుచున్నను, సాక్షాత్తుగా ప్రభుత్వము వహించి కార్యనిర్వాహణము చేయువారు శాసనసభలకు బాధ్యులగు మంత్రులే. ఇంగ్లాండులోని రాజువలెనే ఈగవర్నరుజనరలును, గవర్నరులును, ఈ మంత్రుల సలహాను ఎన్నడు త్రోసివుచ్చరు. వీరికార్యనిర్వాహణమునకు ఎన్నడును అడ్డుతగులరు. తామేవ్యవహారమును స్వయముగాచేయరు.

శాసనసభలయధికారమునకు ఆటంకము కలిగింపరు. పరిపాలన మెల్ల ప్రజాప్రతినిధుల యిష్టానుసారముగానేజరుగును. ఇదియే ప్రజాప్రభుత్వపద్ధతి; బాధ్యతాయుత స్వపరిపాలనము యొక్క రాజ్యాంగమర్యాద.

నూతన ఇండియా రాజ్యాంగ చట్టము భారత దేశమునకు నిర్మించిన "ఫెడరల్" పరిపాలనావిధానమును రాష్ట్రములందు స్థాపించిన రాష్ట్రీయస్వపరిపాలనా విధానములందును కెనడా మొదలగు అధినివేశరాజ్యాంగములందలి ప్రజాప్రభుత్వ పద్ధతులుగాని, రాజ్యాంగమర్యాదలుగాని కానరావు సరికదా ఈరాజ్యాంగచట్టములోని కొన్ని పద్ధతులును, నిబంధనలును ప్రజాప్రభుత్వపద్ధతులకు సిద్ధాంతములకును గూడ వ్యతిరేకములై గవర్నరుజనరలు యొక్కయు, గవర్నరులయొక్కయు, నిరంకుశపరిపాలననే స్థాపింపజూచుచున్నవి. ఇచ్చటి గవర్నరుజనరలును గవర్నరులును, ఆరాజ్యములందువలె ప్రజాప్రతినిధుల యిష్టానుసారముగా అన్నివిషయములందును శాసనసభలకు బాధ్యులగు మంత్రుల సలహాసహాయములతో పరిపాలింపవలసిన పనిలేదు. దేశరక్షణ అనగా సైనికవ్యవహారములు, విదేశవ్యవహారములు, గవర్నరుజనరలు స్వయముగా పరిపాలించువిషయములు. మిగిలిన ప్రభుత్వవ్యవహారములలో అనేకములు గవర్నరుజనరలును, గవర్నరులును తమస్వతంత్ర వివేచనను, స్వబుద్ధినిఉపయోగించి స్వయముగా పరిపాలింపవలసినవిగా శాసింపబడి అందుకు గావలసిన విశేషాధికారములు వారికివ్వబడినవి. గవర్నరు

జనరలును, గవర్నరులును తమ స్వతంత్రవివేచన నుపయో గింపవలసిన విషయములందు వారు మంత్రులతో ఆలోచిం పవలసిన పనియేలేదు. స్వబుద్ధినుపయోగించి వ్యవహరించ వలసిన విషయములందు వారు మంత్రులతో ఆలోచింతురు గాని మంత్రులసలహాప్రకారము పరిపాలింపవలెనను నియ మములేదు. అందువలన నీమంత్రులు అధినివేశరాజ్యము లందువలె ప్రభుత్వమువహించి కార్యనిర్వహణముచేయు పరిపాలక వర్గముగా నుండరు.

ప్రజాప్రభుత్వ పద్ధతులననుసరించి మంత్రుల కుండ వలసిన పరిపాలనాధికారములు గవర్నరుజనరలు గవర్నరుల కివ్వబడినట్లే శాసనసభలకుండవలసిన శాసననిర్మాణాధికార మును గవర్నరుజనరలుకు గవర్నరులకునివ్వబడినవి. రాజ్యాంగ చట్టమునుబట్టి ఈశాసనసభలు కేంద్రమున గవర్నరుజనరలు యొక్కయు, రాష్ట్రములందు గవర్నరులయొక్కయు అను జ్ఞనుపొందనిది కొన్నివిషయములను గూర్చి శాసనములు చేయుటకువీలులేదు. కొన్నివిషయములను గూర్చి శాసన ములను చేయుటకసలేవీలులేదు. శాసనసభలు చేయగలచట్ట ములైనను గవర్నరుజనరలు యొక్కలేదా గవర్నరులయొక్క అంగీకారములేనిది అమలులోనికిరావు. గవర్నరుజనరలును గవర్నరులును తమకవసరమనితోచిన శాసనములను స్వయ ముగా చేయవచ్చును. వీరివిశేషాధికారములకు సంబంధించిన ఆదాయవ్యయములను గూర్చికూడా శాసనసభలకు అధికార ములేదు

దేశముయొక్క శాంతిభద్రతలు, ఆర్థికక్షేమము, అల్పసంఖ్యాకజనసంఘముల హక్కులు, ప్రభుత్వోద్యోగుల హక్కులు, బ్రిటీషుసరకుల దిగుమతి, బ్రిటీషువర్తకుల, వృత్తివంతుల హక్కులు, సంస్థానములహక్కులు, గవర్నరు జనరలుకిందనుండు శాఖల అమలు వ్యవహారములును, గవర్నరుజనరలుకు ప్రత్యేకబాధ్యతగల అధికారమండలములుగా సృజియింపబడి అందుకుసంబంధించి నంతవరకు అతను తనస్వబుద్ధినే ఉపయోగించిచర్యతీసికొనవలెనని విధింపబడి అందుకుగావలసిన విశేషాధికారములతని కొసగబడినవి. ఇట్లే రాష్ట్రములందలి శాంతిభద్రతలు, అల్పసంఖ్యాకజనసంఘములహక్కులు, ప్రభుత్వోద్యోగులహక్కులు, బ్రిటీషు వర్తకముయొక్కహక్కులు, సంస్థానములహక్కులు, గవర్నరు జనరలుజారీచేయు ఆజ్ఞలను అమలుజరుపుట, గవర్నరుకు ప్రత్యేకబాధ్యతగల అధికారమండలముగా చేయబడి ఆవిషయములకు సంబంధించినంతవరకు అతడు స్వబుద్ధినే వినియోగించి చర్యగైకొనవలెనని శాసింపబడి అందుకుగావలసిన విశేషాధికారములతని కొసగబడినవి. అనగా ఈవిషయములందు వీరుమంత్రుల సలహాను త్రోసిరాజనవచ్చును. గవర్నరుజనరలుకును గవర్నరులకును ఇవ్వబడిన విశేషాధికారములకు సంబంధించినంతవరకు వీరు ఇంగ్లాండులోని బ్రిటీషు సామ్రాజ్యమంత్రియగు ఇండియాకార్యదర్శికి బాధ్యులై అతనియాజ్ఞలప్రకారము ప్రవర్తింతురు. అందువలన భారతదేశ క్షేమముకొరకుగాక బ్రిటీషుసామ్రాజ్యక్షేమలాభములకొరకే వీరుతమ అధికారములను వినియోగింతురనుటనిశ్చయము

ప్రభుత్వమంతయు ప్రజాప్రతినిధుల యిష్టానుసారముగా మంత్రులసలహా సహాయములతో జరుగవలెనను ప్రజాప్రభుత్వ పద్ధతి, రాజ్యాంగచట్టమునుబట్టిగాని మనకు లేకపోగా చట్టము మినహాయింపగా మన ప్రజాప్రతినిధులకు మిగిలిన ప్రభుత్వాధికారములైనను మంత్రులసలహాసహాయముల ప్రకారము ప్రజాప్రతినిధుల యిష్టానుసారముగా పరిపాలింపబడునా? అనునది పై కారణములనుబట్టి కేవలము రాజ్యాంగకార్యదర్శి యొక్కయు ఆతని తాబేదారులగు గవర్నరుజనరలు, గవర్నరుల చిత్తములపైన నాధారపడియుండును. సామాన్యపరిపాలనమునందు కూడ మంత్రులపరిపాలనయు, శాసనసభల చట్టములును తమప్రత్యేక బాధ్యతలకు భంగముకలిగించునను నెపమున మంత్రులను శాసనసభలను కూడత్రోసిరాజని స్వబుద్ధి నుపయోగించి విశేషాధికారములను చెలాయించి నిరంకుశ పరిపాలన జరుపవచ్చును. అందువలననే సామాన్య పరిపాలనయందైనను ప్రజాప్రభుత్వపద్ధతి పాటింపబడునని- అనగా మంత్రులసలహా ప్రకారమే పరిపాలన జరుగుననియు చట్టముప్రకారము మంత్రులుప్రవర్తించునంతవరకు గవర్నరులు తమవిశేషాధికారములను ప్రయోగించి నిరంకుశముగా ప్రవర్తింపరనియు, ఒక రాజ్యాంగమర్యాద ఏర్పడుట అత్యంతావశ్యకమైనది. ఇటిమర్యాద పాటింపబడునని బ్రిటీషు సామ్రాజ్యప్రభుత్వము తరఫున వారిరాజ్యాంగకార్యదర్శియు గవర్నరుజనరలును ప్రకటన చేయువరకు రాష్ట్రములందు కాంగ్రెసువారు మంత్రిత్వాధికారములను స్వీకరింపలేదు.

---

# నూతన ఇండియా : :

# : : రాజ్యాంగ చట్టము

## రాష్ట్రీయ "స్వ" పరిపాలనము

కేంద్రప్రభుత్వము :

భారతదేశ ప్రభుత్వాధికారములెల్ల ఇంగ్లాండు దేశ చక్రవర్తియందు నెలకొల్పబడి ఆయనతరఫున రాజప్రతినిధి యగు గవర్నరు జనరలు వలన చలాయింప బడునట్లు ఇండియాచట్టము విధించుచున్నది. గవర్నరు జనరలు స్వతం త్రవివేచనను, [redacted] ఉపయోగించవలెనని చట్టము నిర్ణ యించిన ప్రభుత్వ వ్యవహారములందు తప్ప తక్కినవిషయ ములం దాతనికి సలహానిచ్చి సహాయముచేయుట కొరకమంత్రి మండలి యుండును. అయితే గవర్నరు జనరలు స్వబుద్ధి [illegible] [illegible] కలిగిన పట్ల వీరి సలహాప్రకారము జరుప నక్కరలేదు.

విదేశవ్యవహారములు, దేశరక్షణ, క్రైస్తవ మతము, పరిసరజాతులకు సంబంధించిన విషయములు, కేంద్రప్రభుత్వ మునకే సంబంధించి గవర్నరు జనరలు స్వతంత్రవివేచనను, [redacted] ఉపయోగించి వ్యవహరింపవలసిన విషయములుగా పేర్కొనబడెనవి. దేశముయొక్క శాంతిభద్రతలను కాపాడుట,

ఆర్థికక్షేమమును కనిపెట్టుట, అల్పసంఖ్యాకుల న్యాయమగు హక్కులు సంరక్షించుట, చట్టమువలన (ఐ. సి. ఎస్. మొదలగు) ప్రభుత్వోద్యోగుల కివ్వబడిన విశేషహక్కులను కట్టుదిట్టపరచుట, చట్టము యొక్క 5-వ భాగములోని 3-వ ప్రకరణమునందు ఇంగ్లీషువారి దేశములోనికి వచ్చుటకు, వ్యాపారము, వృత్తులు జేసికొని లాభములు పొందుటకు ఎట్టి యాటంకములు లేకుండా శాశ్వత దానశాసనముగా వ్రాసి యివ్వబడిన విశేషహక్కులు కట్టుదిట్టపరచుట, ఇంగ్లీషుసరకులను నిరోధించుటకు చేయబడు చర్యలను నిషేధించుట, స్వదేశసంస్థానముల యొక్క మర్యాదను, హక్కులను కాపాడుట, ఈచట్టము క్రింద గవర్నరుజనరలు స్వతంత్ర వివేచనను గాని, స్వబుద్ధినిగాని ఉపయోగించవలసినదని సూచింపబడిన సందర్భములందు తీసుకొనవలసిన చర్యలు ఇంకొకవ్యవహారము భంగము కలిగింపకుండ జూచుట అనునవి గవర్నరు జనరలు ప్రత్యేక బాధ్యతలతో నిర్వహింపవలసిన అధికారములుగా నిర్ణయించబడి వీటికి సంబంధించినంత వరకు ఏయే చర్యలను తీసికొనవలెనో నిర్ణయించుటలో గవర్నరు జనరలు స్వబుద్ధినే ఉపయోగించవలెనని శాసింపబడినది. ఈవిషయములందు గవర్నరుజనరలుపైన ఇంగ్లాండు రాజ్యాంగ కార్యదర్శికి పెత్తనముండును. ఇంగ్లాండు పార్లమెంటునకు సర్వాధికారముండునని వేరుగా చెప్పవలసిన పనిలేదు. రాజ్యాంగ చట్టములోనే సూచింపబడిన స్వల్పసందర్భములందు ముందుగా గవర్నరు జనరలుయొక్క అనుమతితోతప్ప కేంద్ర శాసన

సభల కీవిషయములందు శాసన నిర్మాణాధికార ముండనే యుండదు. మంత్రిసభ కీవ్యవహారములందు పరిపాలనాధికారములు మొదలేయుండవు.

*రాష్ట్రీయపరిపాలన:*

ఇట్టి రాష్ట్రీయ శాసనసభలకు, మంత్రులకు, శాసన నిర్మాణ పరిపాలనాధికారములు లేకుండా ఇంగ్లాండు పార్లమెంటుయొక్కయు, రాజ్యాంగ మంత్రియొక్కయు, గవర్నరు జనరలుయొక్కయు పై పెత్తనమునకు లోబడి గవర్నరుకే ప్రత్యేక బాధ్యతతో స్వతంత్ర వివేచనను, స్వబుద్ధిని ఉపయోగించి వ్యవహరించుట కధికారము గలిగియుండు విషయములు ఇండియా చట్టము ~~[illegible]~~ లోనే వివరింపబడినవి *గవర్నరు స్వతంత్ర వివేచన నుపయోగించవలసిన కార్యములు మంత్రుల నడిగే ఆలోచించడు; స్వబుద్ధి నుపయోగించవలసినవి ఆలోచించును గాని పరిపాలన ప్రకారము [illegible]*

* (50) రాష్ట్రము యొక్క పరిపాలనాధికారము (కార్యనిర్వహణాధికారము) చక్రవర్తి తరఫున గవర్నరు స్వయముగాగాని, తన తాబేదారుల ద్వారాగాని చలాయింపవలెను.

ఈ చట్టముక్రింద గవర్నరు స్వతంత్రవివేచన నుపయోగింపవలసిన విషయములందుతప్ప తక్కిన కార్యములందు గవర్నరుకు తోడ్పడుటకు, సలహాయిచ్చుటకు ఒక మంత్రిసభయుండును. ఈచట్టముక్రిందగాని, చట్టమునుబట్టిగాని,

* ఈ అంకెలు ఇండియా చట్టములోని (సెక్షనులు) పరిచ్ఛేదముల సంఖ్యలు.

గవర్నరు తన స్వబుద్ధి (Individual judgment) నుపయోగించుటకు పైఉపవిధి (మంత్రిసభ యొక్క సలహా, సహాయములు అనునవి) ఎట్టి అడ్డంకిగాని కలుగులాగున అన్వయింపబడరాదు. ఒకవిషయము గవర్నరు స్వతంత్రవివేచనను గాని, స్వబుద్ధినిగాని ఉపయోగింపవలసిన దగునా, కాదా యను అనుమానము కలిగినచో అందుపైన గవర్నరుఇచ్చు తీర్పుకు తిరుగులేదు. తన కిష్టమైనచో గవర్నరు మంత్రిసభయం దధ్యక్షత వహించవచ్చును.

(51) గవర్నరే మంత్రులను నియమించి ఆహ్వానించవలెను.[1] వారు మంత్రులసభలో సభ్యులుగా ప్రమాణము చేయువలెను. గవర్నరుకు చిత్తమువచ్చినన్నాళ్ళు వారు మంత్రులుగా నుందురు. మంత్రులను పేర్కొనుటలోను, ఆహ్వానించుటలోను, తొలగించుటలోను, వారి జీతములు, నిర్ణయించుటలోను గవర్నరు స్వతంత్రవివేచన నుపయోగింపవలెను.

(52) గవర్నరుయొక్క ప్రత్యేకబాధ్యతలు, అధికారములు:

1. రాష్ట్రమంతటనుగాని, కొంతభాగమునగాని, శాంతిభద్రతలకు తీవ్రాపాయము వాటిల్లకుండ కాపాడుట; అల్పసంఖ్యాకుల[2] యొక్క న్యాయమగు హక్కులను సంరక్షించుట; ఈచట్టముక్రింద నిర్ణయింపబడిన పెద్దసర్కారునౌక

1. చూడు. [illegible] 7, 8

రీలకు చెందినవారియొక్కయు, వారిపై నాధారపడియుండు వారియొక్కయు న్యాయమగు హక్కులను సంరక్షించుట; ఈ చట్టము యొక్క 5-వ భాగమునందలి 3-వ ప్రకరణములో [illegible] చెప్పబడిన శాసనవిధుల యొక్క ఉద్దేశములను[1] పరిపాలనా (కార్యనిర్వాహక) మండలమునందు కట్టుదిట్టపరచుట; రాజ్యాంగచట్టములో మినహాయింపబడిన ప్రదేశములలో శాంతిని, సత్పరిపాలనమును స్థాపించుట; స్వదేశ సంస్థానముల యొక్క, సంస్థానాధీశులయొక్క హక్కులను గౌరవమును, సంరక్షించుట; ఈ చట్టము యొక్క 6_వ భాగము ననుసరించి గవర్నరుజనరలు తన వివేచన ప్రకారము జారీచేయు ఉత్తరువులను, సూచనలను అమలుజరుపుట.

2. మధ్యరాష్ట్రముల గవర్నరుకు బేరారు రాష్ట్రము లోగల ప్రత్యేకాధికారములు, సింధురాష్ట్రగవర్నరుకుగల ప్రత్యేకబాధ్యతలు వివరింపబడినవి.

3. గవర్నరుయొక్క ప్రత్యేక బాధ్యతలకు సంబంధించిన విషయములందెల్ల కార్యాచరణలో అతడు తన స్వబుద్ధినే ఉపయోగించవలెను.

(53) చక్రవర్తి గవర్నరుకిచ్చిపంపు రాజ నిర్దేశ పత్రము,[3] లేక సన్నదులో గవర్నరుయొక్క కర్తవ్యములు సూచింపబడును. ఈ సన్నదు మొదట నిచ్చుటకు పూర్వమును, తరువాత ఏమైనా రద్దుచేసినను, మార్చినను ఆ

1 సూచన. రాజ నిర్దేశ పత్రము నిబంధన 10.
2 " " " 11
3 " " " "

చిత్తుప్రతి పార్లమెంటు ఎదుట పెట్టబడుచుండవలెను. గవర్నరు చేసిన ఏ కార్యముగాని అతడు తన సన్నదు (రాజ నిర్దేశ పత్రము) నకు భిన్నముగా వర్తించినందున చెల్లదని విమర్శింప బడకూడదు.(54) గవర్నరు స్వతంత్ర వివేచనను, స్వబుద్ధిని ఉపయోగించవలెనని ఈ చట్టముక్రింద విధింపబడిన ప్రతి విషయములోను అందుకు సంబంధించినంత వరకు గవర్నరు జనరలుయొక్క పై అధికారమునకు లోబడవలెను. గవర్నరు జనరలు స్వతంత్ర వివేచన ననుసరించి, జారీచేయు సూచనల నితడు శిరసావహించవలెను.

అయితే పైన చెప్పబడిన ప్రకారము జరుగనందున చెల్లదని ఏ కార్యముగాని ఎవరివల్లను విమర్శింపబడరాదు. చక్రవర్తి గవర్నరుకిచ్చిన సన్నదునకు భిన్నముగానుండు సూచనలను గవర్నరు జనరలు చేయరాదు.

(55) గవర్నరు ఎవరినైనను ఒకరిని అడ్వొకేటు జనరలుగా నియమించవలెను. అడ్వొకేటు జనరలు రాష్ట్రీయ ప్రభుత్వమునకు సలహా నివ్వవలెను. అతడు గవర్నరుసూచించు ఇతర కార్యములను నెరవేర్చవలెను. ఇతనిని నియమించుటలోను, తొలగించుటలోను, జీతమును నిర్ణయించుటలోను గవర్నరు తనస్వబుద్ధిని ఉపయోగింపవలెను.

(56) సివిలు, మిలిటరీశాఖలయొక్కయు, పోలీసుదళము నకు సంబంధించిన రూల్సు, రెగ్యులేషన్లు, (నిబంధనలు,

కట్టుబాటులు
~~ఉత్తరువులు~~) గాని చేయుటకు, మార్పుటకు గవర్నరుకు అధికారమున్నప్పుడు అందుకు సంబంధించిన సూచన ఆదళముయొక్క నిర్మాణవ్యవస్థకుగాని, క్రమశిక్షణ (discipline)కు గాని సంబంధించినట్లు కనబడినప్పుడు గవర్నరు తన స్వబుద్ధినే ఉపయోగించవలెను.

(57) ప్రభుత్వమును కూలగద్రోయుట: (i) దౌర్జన్యపూరితములగు నేరములు చేయువారియొక్కగాని, చేయప్రయత్నించువారియొక్కగాని వ్యవహారముల విషయములో అందుకు సంబంధించినంతవరకు ఫలానా అధికారములు తానుచలాయింతునని గవర్నరు ఉత్తర్వు చేయవచ్చును. (ii) పై సందర్భములో శాసనసభలలో మాటలాడుటకుగాని, పాల్గొనుటకుగాని. గవర్నరొక అధికారికి పురమాయించవచ్చును. (iii) ఈ పరిచ్ఛేదములో చెప్పబడిన అధికారములు గవర్నరుయొక్క స్వతంత్ర వివేచనతో చలాయింపబడవలెను. (iv) రాష్ట్రమునగాని, రాష్ట్రములోని ఏభాగమునగాని శాంతిభద్రతలకు తీవ్రాపాయము కలుగకుండ కాపాడుటకు గవర్నరుగల ప్రత్యేక బాధ్యతల నీ పరిచ్ఛేదము బాధింపనేరదు.

(58) (పై పరిచ్ఛేదమునకు సంబంధించిన) కొన్ని విషయములనుగూర్చిన ఆచోకీ సమాచారముయొక్క పుట్టు పూర్వోత్తరములు ఇనస్పెక్టరు జనరలు ఆజ్ఞనుబట్టి తప్ప పోలీసుశాఖలోని ఒకవ్యక్తి ఆశాఖలోని యింకొకనికి వెల్లడింపకుండాను, గవర్నరుయొక్క ఆజ్ఞనుబట్టి తప్ప పోలీసుశాఖ

లోనివారు యితరులకు వెల్లడింపకుండాను, ప్రభుత్వోద్యోగమునందుండు వారెవ్వరును గవర్నరు ఆజ్ఞనుబట్టి తప్ప ఇతరుల కెవ్వరికిని వెల్లడింపకుండాను కట్టుదిట్టములు చేయుటకు గవర్నరు స్వతంత్ర వివేచన ననుసరించి నిబంధనలు చేయవలెను.

(59) రాష్ట్రపరిపాలనమెల్ల గవర్నరు పేరుననే జరుపబడవలెను. రాష్ట్రప్రభుత్వముయొక్క వ్యవహారములు చక్కగా జరుగగలందులకును, చట్టము క్రింద గల వివేచనప్రకారము జరుపబడవలెనని నిర్ణయింపబడిన వ్యవహారములు తప్ప తక్కిన వ్యవహారములు మంత్రులకు పంచియిచ్చుటకును గవర్నరు నిబంధనలను చేయవలెను.

నిబంధనలలో చెప్పబడిన రాష్ట్రీయప్రభుత్వ వ్యవహారములకు సంబంధించిన సమాచారమును, ఇంకా గవర్నరు సూచించు యితర సమాచారములను మంత్రులును, ప్రభుత్వకార్యదర్శులును విధిగా గవర్నరుకు చేరవేయులాగున నిర్ణయించు నియమములు ఆ నిబంధనలందు చేర్పబడవలెను. మరియు ముఖ్యముగా ఆలోచనలోనున్న ప్రతి విషయములోను గవర్నరుయొక్క ప్రత్యేకాధికారమునకు సంబంధించినట్టి గాని, సంబంధింపగలట్టి గాని అంశమేమైననున్నచో ప్రభుత్వకార్యదర్శి ఆ శాఖయొక్క మంత్రికిని, ఆమంత్రి గవర్నరుకును నివేదించవలెనను నియమములును అందు చేర్పబడవలెను. పై ఉపపరిచ్ఛేదములో చెప్పబడిన

కార్యములను నెరవేర్చుటలో గవర్నరు మంత్రులతో ఆలోచించిన పిదప స్వతంత్ర వివేచననే ఉపయోగించి నిర్వహించవలెను.

(62) లెజిస్లేటివు అసెంబ్లీని సమావేశపరచుటకును, దానిని కొన్నాళ్లవరకు వాయిదా వేయుటకును విలయనము చేయుటకును గవర్నరుకే అధికారముగలదు.

(63) శాసనసభయం దుపన్యసించుటకును, అందుకొరకు ఉభయసభలు కలసిన సమావేశములో సభ్యులను హాజరు కావలసినదని కోరుటకును, వారికి ఒక చిత్తు చట్టమును గూర్చి కాని, ఇంక దేనినిగూర్చి కాని సందేశము నంపుటకును గవర్నరు కధికారము గలదు.

(74) లెజిస్లేటివు అసెంబ్లీలో తీర్మానమై కౌన్సిలు కంపబడిన చిత్తుచట్టము 12 నెలలలో గవర్నరు అనుమతి కొరకు పంపబడనిచో ఉభయసభలను సమావేశపరుపవచ్చును. అది ఆర్థికసంబంధమైనచో 12 నెలల లోపుగాకూడ సమావేశ పరుపవచ్చును. ఈకార్యములెల్ల గవర్నరు స్వతంత్ర వివేచన నుపయోగించి చలాయింపవలెను.

(75) శాసనసభలు తీర్మానించిన చిత్తుచట్టమునకు చక్రవర్తిపేరట గవర్నరు తన అంగీకారమును ప్రకటింపవచ్చును; లేదా నిరాకరింప వచ్చును. అదియుగానిచో చిత్తుచట్టమును

గవర్నరు జనరలువలన ఆలోచింపబడుటకు నిలుపుదల చేసి యుండవచ్చును.* చిత్తుచట్టమును పునరాలోచన కొరకుగాని, తాను సూచించు మార్పులను ఆలోచించ వలసినదనిగాని ఒక సందేశముతో ఆచిత్తు చట్టమును వెనుకకు పంప వచ్చును.

(76)ఒకచిత్తుచట్టము గవర్నరుజనరలుచే ఆలోచింపబడుట కొరకు నిలుపుదల చేయబడునప్పుడు గవర్నరు జనరలు తన స్వతంత్ర వివేచన నుపయోగించి చక్రవర్తి పేరున అంగీక రించవచ్చును, నిరాకరించవచ్చును. లేదా చక్రవర్తియొక్క చిత్తముకొరకు నిలుపుదలచేసి నానని చెప్పవచ్చును. ఆచిత్తు చట్టమును పునరాలోచన కొరకుగాని, తాను సూచించు సవరణలను ఆలోచించుకొరకుగాని, శాసనసభకు మరల పంపవలసిన దని గవర్నరుకు సూచించవచ్చును. చక్రవర్తి చిత్తముకొరకు నిలుపుదల చేయబడిన చిత్తుచట్టము గవర్నరుకు నివేదింపబడిన తేదీ లగాయతు 12 నెలలలో అది చక్ర వర్తిచే అంగీకరింపబడినదని గవర్నరు ప్రకటించినగాని అది శాసనము కాగూడదు.

(77) గవర్నరుగాని, గవర్నరు జనరలుగాని అంగీకరించిన ఏచట్టమునైనను 12 నెలలో చక్రవర్తి నిరాకరించ వచ్చును. అంతట నొక ప్రకటన మూలముగా నాచట్టము రద్దుఅగును.

* చూడు: రాజ్యాంగ పత్రము సంఖ్య 16, 17.

(78) రాష్ట్రముయొక్క సాలువారీ ఆదాయవ్యయ అంచనా పట్టిక (బడ్జెటు) ను గవర్నరు శాసనసభ యెదుట పెట్టించవలెను. ఆపట్టికలో ఈచట్టముక్రింద రివిన్యూ ఆదాయముపైన బద్ధత చేయబడిన (ఆధారపరుపబడిన) వ్యయములు వేరుగాను, రివిన్యూలోనుండి ఖర్చుచేయదలచిన ఇతర వ్యయములు వేరుగాను చూపించవలెను. ఇతర వ్యయములలో గవర్నరు తన ప్రత్యేక బాధ్యతలను బట్టి చేయదలచిన ఖర్చులు ప్రత్యేకముగా చూపించవలెను.

ఈక్రింది వ్యయములు ప్రతిరాష్ట్రముయొక్క రివిన్యూ ఆదాయముపైన బద్ధత చేయబడియుండును:

1. గవర్నరుకిచ్చుజీతము, బత్తెములు; చక్రవర్తి కవున్సిలు ఆర్డరుద్వారా సూచించు ప్రకారము ఆహోదాకు సంబంధించిన ఇతర వ్యయములకగు సొమ్ము. 2. రాష్ట్రము బాధ్యతవహించు ఋణము, దానిపైన వడ్డీలు, ఋణ తీర్మాన నిధిఖర్చులు, తీర్మాన వ్యయములు, ఋణములు తెచ్చుటకు సంబంధించిన ఇతర ఖర్చులు. 3. మంత్రుల యొక్కయు, అడ్వొకేటు జనరలుయొక్కయు జీతములు. 4. హైకోర్టు జడ్జీల జీతములు, బత్తెములు. 5. మినహాయింపబడిన ప్రదేశముల పరిపాలనకగు వ్యయములు. 6. ఏకోర్టువలనగాని మధ్యస్థసభ వారివలనగాని, తీర్పు చేయబడిన మొత్తము చెల్లించుటకు వలసిన సొమ్ము. 7. ఈ చట్టమువలన గాని,

రాష్ట్రీయ శాసన సభవలన గాని రివిన్యూపైన బద్ధత చేయబడువ్యయమునకగుసామ్ము.

ఎప్పుడైనను, చేయదలచిన వ్యయము, రివిన్యూపైన బద్ధత చేయబడునట్టి తరగతి క్రిందికి వచ్చునా, రాదా యను అనుమానము కలిగినచో గవర్నరు తన స్వతంత్ర వివేచనను బట్టి నిర్ణయింపవలెను.

(79) రాష్ట్రము యొక్క రివిన్యూ ఆదాయముపైన బద్ధతచేయబడిన వ్యయముల అంచనా శాసన సభలో చర్చింపబడవచ్చును గాని వోటుకు పెట్టబడరాదు. తక్కిన వ్యయములకు సంబంధించిన అంచనా "డిమాండు"ల రూపముగను, "గ్రాంటు"ల రూపముగను శాసనసభలో ప్రవేశపెట్టబడవలెను. దానిని అంగీకరించుటకుగాని, నిరాకరించుటకుగాని అసెంబ్లీ శాసనసభకు అధికారముండును. గవర్నరుయొక్క సిఫారసుపైన తప్ప ఏ గ్రాంటును (శాసనసభలో) ప్రవేశపెట్టబడరాదు.

(80) ప్రథమముగా ప్రవేశపెట్టబడిన అంచనామొత్తములకు మించని మొత్తమును గవర్నరు తన అధికారమును బట్టి షెడ్యూలులో మరలచేర్చవచ్చును. గవర్నరు అట్లు ధ్రువపరచి పంపిన షెడ్యూలు అసెంబ్లీసభ యెదుట పెట్టబడునుగాని దానిని చర్చించుటకుగాని, దానిపైన వోటు చేయుటకు గాని వారి కధికారము లేదు.

(81) అవసరమైనప్పుడు అదనపు వ్యయముల యాదాస్తు [స్టేటుమెంటు]ను అసెంబ్లీలో ప్రవేశపెట్టవచ్చును.

(82) ఆర్థిక విషయములకు సంబంధించిన ప్రత్యేక విధులు:

పన్నులు విధించుటనుగూర్చి నట్టియు, ఋణములు చేయుటను గూర్చినట్టియు, వ్యయములను రివిన్యూఆదాయముపైన ఆధారపరచుటను గూర్చి నట్టియు చిత్తుచట్టములు, శాసనసభలో గవర్నరుయొక్క శిఫారసుపైనగాని ప్రవేశపెట్టబడరాదు; ఉపపాదింపబడరాదు.

(83) ఆంగ్లోఇండియనులకును, ఐరోపావారికిని సంబంధించు విద్యకు గ్రాంటులిచ్చుటలో అది 1933-వ సంవత్సరము మార్చినెలకు పూర్వము పది సంవత్సరముల దామాషా గ్రాంటుకు తగ్గియుండకూడదు.

(84) శాసనసభయొక్క వ్యవహార కార్యక్రమ పద్ధతికి సంబంధించిన నిబంధనలను శాసనసభాధ్యక్షులతో ఆలోచించి గవర్నరే చేయవలెను. స్వదేశ సంస్థానములకును ప్రభుత్వమునకును గల సంబంధములనుగూర్చిన ప్రశ్నలు చర్చలను, నిషేధించు విషయము; గవర్నరు జనరలుకును చక్రవర్తికిని, విదేశరాజ్యములకును గల సంబంధములనుగూర్చిన నిషేధము, చట్టమునందు మినహాయింపబడిన ప్రవేశములకు సంబంధించిన విషయములు [గ్రాంటులిచ్చు సంగతి

గాశ], స్వదేశ సంస్థానాధీశుల ప్రవర్తనను గూర్చిన ప్రశ్నలు చర్చలు నిషేధించు నిబంధనలు నట్లే చేయబడవలెను.

[85] శాసనసభలయందు ఇంగ్లీషు భాషయే ఉపయోగింపబడవలెను. ఇంగ్లీషుసరిగా తెలియని వారికి ఇతర భాషయందు మాటలాడుట కవకాశ మొసగబడును.

[86] (i) ఫెడరలుకోర్టు జడ్జీల ఉద్యోగ సంబంధమగు ప్రవర్తననుగూర్చి కాని, హైకోర్టు జడ్జీల ఉద్యోగ సంబంధమగు ప్రవర్తననుగూర్చికాని శాసనసభలయందు చర్చింపరాదు. (ii) శాసనసభ యందు ప్రవేశపెట్టబడినట్టి చిత్తుచట్టముగాని, ఉపపాదింపబడబోవునట్టి చిత్తుచట్టముగాని, అట్టి చట్టములోని పరిచ్ఛేదభాగము [క్లాజు] గాని, ఉపపాదింపబడిన, లేదా ఉపపాదింపబడబోవు సవరణను గూర్చినట్టి చర్యగాని రాష్ట్రముయొక్క, లేదా రాష్ట్రభాగముయొక్క శాంతిభద్రతలకు తీవ్రాపాయము వాటిల్లకుండ కాపాడుటకు తనకుగల ప్రత్యేక బాధ్యతయొక్క నిర్వహణమును బాధించునని గవర్నరు లిఖితపూర్వకముగా సూచించి* తనస్వతంత్ర వివేచన నుపయోగించి ఆచట్టమునకు, శాసనపరిచ్ఛేదమునకు సవరణకు సంబంధించిన ఎట్టి గ్రంథముగాని, ఎట్టి దరిమిలా గ్రంథముగాని జరుపబడరాదని ఆజ్ఞాపించవలయును. అంతట నాతని యాజ్ఞ ఆప్రకార మమలు జరుగవలెను.

* చూడు: శాసననిర్దేశపత్రము. నిబంధన 11

[88] శాసనసభలు సమావేశములో లేనప్పుడు గవర్నరు ఆర్డినెన్సులను శాసించవచ్చును. అట్టి ఆర్డినెన్సుకు సాధారణచట్టమునకు గల అధికారబలమేయుండవలెను. ఆర్డినెన్సులను శాసించుటలో గవర్నరు తనస్వబుద్ధినే యుపయోగింపవలెను. గవర్నరు జనరలు అనుమతి ముందుగా గైకొనవలసిన శాసనమువంటి ఆర్డినెన్సు విషయములోగూడ గవర్నరు ఆయనుమతిని పొందవలెను. అట్లు గవర్నరు శాసించిన ఆర్డినెన్సు, శాసనసభ సమావేశమైన ఆరువారముల లోగా దాని ఎదుట పెట్టబడవలెను. శాసనసభ వారు తీర్మానించినచో నది రద్దుఅగును.

[89] చట్టముక్రింద తన స్వతంత్ర వివేచనగాని, స్వబుద్ధిగాని ఉపయోగించి చేయువలసిన కార్యములు నిర్వహించు విషయముల త్వరితముగా చర్యతీసుకొనుటకుగాను, ఎప్పుడైనను ఆర్డినెన్సులు శాసించుటకు గవర్నరుకు అధికారము కలదు. అట్టి ఆర్డినెన్సులు ఆరునెలలకు అమలులోనుండును. సామాన్యశాసనములవలెనే ఈ ఆర్డినెన్సులను గూడ చక్రవర్తి నిరాకరించవచ్చును. ఒకఆర్డినెన్సు కాలపరిమితిని పెంపు చేయుచు ఇంకొక ఆర్డినెన్సు చేయబడినచో గవర్నరు గవర్నరుజనరలుకు తెలుపవలెను. గవర్నరుజనరలు ఇంగ్లాండు లోని ఇండియారాజ్యాంగకార్యదర్శికి తెలుపవలెను. అంతట నతడు దానిని పార్లమెంటువారి యెదుట పెట్టవలెను.

[90] గవర్నరు తన కార్యనిర్వాహణమునకు వలసిన చట్టమును తత్క్షణమే శాసించవచ్చును. లేదా శాసింపవలసిన చట్టముయొక్క (చిత్తు) ముసాయిదాతో శాసనసభకు సందేశమంపవచ్చును. తరువాత ఒక నెలలో దానిని చట్టముగా శాసింపవచ్చును. గవర్నరు చట్టములెల్ల గవర్నరు-జనరలుకు వెంటనే తెలుపబడవలెను.

[93] రాజ్యాంగయాంత్రము వమువని సందర్భము: రాష్ట్రముయొక్క పరిపాలన రాజ్యాంగచట్టము ప్రకారము నడుపబడుటకు వీలు లేకున్నదనియు, తానా యా అధికారములను స్వతంత్రవివేచనతో చలాయింపదలచినాననియు గవర్నరు జనరలుయొక్క అనుమతితో గవర్నరు ప్రకటించవచ్చును. రాష్ట్రీయసంస్థవలనగాని, అధికారివలనగాని చలాయింపబడు అధికారములనుగాని గవర్నరే స్వయముగా స్వీకరించవచ్చును. హైకోర్టుయొక్క అధికారములను మాత్రము గవర్నరట్లు స్వీకరింప వీలులేదు. ఇట్టిప్రకటన వెంటనే రాజ్యాంగకార్యదర్శికి తెలియ జేయుబడవలెను. అతడు దానిని పార్లమెంటు యెదుట పెట్టవలెను. ఈ ప్రకటన ఆరునెలలు మాత్రమే అమలులోనుండును.

[రాష్ట్రీయపరిపాలనములో చేయబడిన మినహాయింపులలో ఇంగ్లీషు ఉద్యోగులకును, ఇంగ్లీషువర్తకులకు, వృత్తివంతులకు ఈదేశమున ప్రసాదింపబడిన శాశ్వతహక్కులును జాగ్రత్తగా పరిశీలింప తగినవి. రాష్ట్రీయ శాసనసభలకు

మంత్రులకు అతీతములగు ఇంగ్లీషు వర్తకులకు, వృత్తివంతులకు గల శాశ్వతహక్కులు ఇండియారాజ్యాంగ చట్టము యొక్క 5-వ భాగములోని 3-వ ప్రకరణమున నుదాహరింపబడియున్నవి. ~~వీనిని ముందుగా~~ పరిశీలింతము ]

5-వ భాగము 3-వ ప్రకరణము

(III) బ్రిటీషు ఇండియాలోనికి వచ్చుహక్కులను గూర్చి నిషేధించునట్టి ఫెడరలు రాష్ట్రీయ శాసనములును, ఒకరి పుట్టుక ప్రదేశము, జాతి, వంశము, భాష, మతము, నివాసము, కాపురస్థలము, నివాసకాలములను పురస్కరించుకొని ప్రయాణమునకు, నివాసమునకు, ఆస్తిసంపాదనకు, ఆస్తియొక్క హక్కుల విక్రయమునకు, ఉద్యోగము చేయుటకు, ఏవృత్తినిగాని, వ్యాపారమునుగాని, వర్తకముగాని చేయుటకు, ఏవైనను ఆటంకములు, బాధ్యతలు, నిర్బంధములు విధించునట్టి ఫెడరలు రాష్ట్రీయ శాసనములును, ఇంగ్లాండు, స్కాట్లాండు వేల్సు రాజ్యములు వాసస్థానముగా గల బ్రిటీషు ప్రజలకు వర్తించవు. అయితే ఎవనికైనను పైన చెప్పబడిన ఆటంకము, నిర్బంధము, లేదాబాధ్యతలయందేవైనను ఇంగ్లాండు, స్కాట్లాండు, వేల్సు రాచ్యములందే యుండియున్నచో ఈ శాసన విధులు తనకు వర్తించవని వాదించుటకు అర్హుడు కాడు. (క్వారంటైను) సంసర్గ నిషేధమును చేయుటకుగాని, ఎక్కడి వాడైనను అపాత్రుడుగా ఎంచబడు ఒక వ్యక్తిని నిషేధించుటకుగాని, ద్వీపాంతరమునకు పంపుటకు

గాని, ఒక ఉద్యోగికి అధికారమిచ్చు బ్రిటీషు ఇండియా శాసననియమముగాని, ఇంగ్లాండు శాసన విధులుగాని ఈ పరిచ్ఛేదమున చెప్పబడిన [రాకపోకలను గూర్చిన] నిర్బంధముగా ఎంచబడరాదు.

ఈ పరిచ్ఛేదములో చెప్పబడినదానితో నిమిత్తము లేకుండా గవర్నరుజనరలుగాని, గవర్నరుగాని ఇండియాలో నేభాగమునందలి శాంతిభద్రతలకైనను తీవ్రాపాయములు గలుగకుండ కాపాడుటకును, ప్రభుత్వమును తిరుగ దోచుటకు దౌర్జన్యపూరితములగు నేరములు జరుగకుండ నిరోధించుటకును, పై పరిచ్ఛేదములోని మొదటి ఉపపరిచ్ఛేదమును పూర్తిగాగాని, కొంతవరకుగాని అపుదలచేయవలెనని బహిరంగ ప్రకటనద్వారా నిర్ణయించినచో అప్రకటన అమలులో నున్నంతకాలము ఈవిధులు అపుదలమైయుండును. ఈనిబంధనక్రింద గవర్నరు జనరలు, గవర్నరు, జరుపు చర్యలు తమస్వతంత్ర వివేచనము నుపయోగించియే జరుపవలెను.

(112) ఇంగ్లాండు, బర్మాలలో నివసించునట్టి బ్రిటీషు పౌరులమొడలను, ఈచట్టమునకు పూర్వముగాని, దరిమిలాను గాని ఇంగ్లాండు, బర్మాలలో రిజష్టరుచేయబడిన కంపెనీల మొడలను విచక్షణము చూపుచు వన్నులువిధించు ఫెడరలు రాష్ట్రీయశాసనములు అవిచక్షణకు సంబంధించినంతవరకు చెల్లవు.

బ్రిటీషుఇండియాలో నివసించువారిపైనను, రిజిష్టరు చేయబడిన కంపెనీలపైనను విధింపబడు పన్నులకన్న హెచ్చు పన్నులు విధించినచో ఆశాసనము అట్టి విచక్షణము చూపు చున్నదనియే యెంచబడవలెను.

(113) బ్రిటీషుఇండియాలో వ్యాపారము చేయదలచిన కంపెనీలవిషయములో రిజిష్టరుజేయు ప్రదేశమునుగూర్చి గాని కంపెనీకార్యస్థాన ప్రదేశమునుగూర్చి గాని, దానిమూల ధనము, లేక ఋణగ్రహణ ధనము, ఫలానా చెలామణిలో నుండవలసినదని గాని విధింపబడిన అర్హతలును షరతులును కంపెనీల పరిపాలక వర్గము వారియొక్కయు, వాటాలు పత్రములు డిబెంచర్లు డిబెంచరుస్టాకు బాండ్లును పుచ్చుకొన్న వారి యొక్కయు, కంపెనీ అధికారులు ఏజంట్లు, నౌకరులు యొక్కయు పుట్టుక ప్రదేశము, జాతి, వంశము, భాష, మతము, నివాసము, కాపురస్థలము, నివాసకాల పరిమితిని పురస్కరించుకొని విధింపబడిన అర్హతలును, షరతులును ఈచట్టమునకు పూర్వమునగాని, దరిమిలానుగాని, ఇంగ్లాండు చట్టముల ప్రకారము రిజిష్టరైనట్టి కంపెనీలును, వాని యొక్క పరిపాలక వర్గములును, వాని వాటాలు పత్రములు డిబెంచర్లు డిబెంచరు బాండ్లను గైకొన్నవారును, ఆకంపెనీ అధికారులు, ఏజంట్లు, నౌకరులును కలిగియున్నట్లుగనే భావింపబడవలెను. అయితే అట్టి కంపెనీలును, అందలివ్యక్తు లును ఇంగ్లాండులోనే అట్టి అర్హతలు, షరతులును కలిగి యుండనిచో యిచ్చట కలిగి యున్నట్లుగా భావింపబడరు.

ఇండియాలో రిజిస్టరై ఇంగ్లాండులో వ్యాపారము చేయు కంపెనీలకును, వానికి సంబంధించిన వ్యక్తులకును, ఇంగ్లాండులో పైన చెప్పబడినట్టి అర్హతలు, షరతులను బట్టి పన్నులు విధింపబడ నంతవరకు, ఇండియాలో పై అర్హతలు, షరతులను పురస్కరించుకొని పన్నులు విధించుటలో కొంత గాని, అంతగాని, మినహాయింపులును, అధికాదరణమును గాని యున్నచో ఇండియాలో వర్తకముచేయు ఇంగ్లీషు కంపెనీలును, వానివ్యక్తులును ఆ అర్హతలను కలిగి యున్నట్లే ఎంచబడ వలెను.

(114) బ్రిటీషు ఇండియాలో రిజిస్టరు చేయబడుటకు కంపెనీల విషయములో వాని పాలక వర్గము వారియొక్కయు, వాటాదారులు, డిబెంచరు బాండు దారులయొక్కయు జన్మస్థానము, జాతి, వంశము, భాష, మతము, నివాసస్థానము కాపురస్థలము, నివాసకాల పరిమితిని - పురస్కరించుకొని నిర్ణయింపబడిన అర్హతలు, షరతులు, ఇంగ్లాండు వాసస్థులగు బ్రిటీషు పౌరులు కలిగియున్నట్లుగనే భావింప బడవలెను. అనగా వారికి వర్తించవు. అయితే ఇంగ్లాండులోనే వారికా అర్హతలు లేనిచో వారి కిచ్చుట నున్నట్లు యెంచబడదు.

పై అర్హతలను, షరతులను పురస్కరించుకొని పన్నులు విధించుటలో తారతమ్యముగాని, అధికాదరణగాని చూపబడు నెడల ఇండియా కంపెనీలకు ఇంగ్లాండులో పన్నులు

విధించుటలో అట్టి అర్హతలు, షరతులు విధింపబడనంత కాలము ఇండియాలోని ఇంగ్లీషు కంపెనీలకును ఈ విచక్షణ వర్తింపదు.

(115) ఇంగ్లాండు చట్టముల ప్రకారము రిజిష్టరు కాబడిన ఓడలవిషయములో ఓడయజమాని, అధికారులు, పరివారము ప్రయాణికులు, సరుకువిషయములోను, బ్రిటిషుఇండియాలో రిజిష్టరైన ఓడలకును, ఓడయజమాని, అధికారులు, పరివారము, ప్రయాణికులు సరకులకును ఇంగ్లాండులో ఏతారతమ్యము చూపబడుచున్నదో అంతకంటె వేరు విచక్షణలను ఫెడరలు రాష్ట్రీయ శాసనములు విధింపరాదు.

ఈ పరిచ్ఛేదము వాయువిమానముల విషయములో కూడావర్తించును. ఇందలి నియమములు ఈ ప్రకరణమునందిదివరకు చెప్పబడిన నియమములకు అదనముగానుండును గాని వానినేవిధముగను తగ్గించవు.

(116) ఈచట్టమునకుపూర్వముగాని, దరిమిలానుగాని ఇంగ్లాండులో రిజష్టరుచేయబడి ఇండియాలో వ్యాపారముచేయు కంపెనీలు ఇండియాలో రిజష్టరైన కంపెనీలతోపాటు ఫెడరలు, రాష్ట్రీయ ప్రభుత్వమువారు వ్యాపారపరిశ్రమలను ప్రోత్సహించుటకొరకు ఇచ్చు ధనదానములు బౌంటీలు సబ్సిడీలు బహూకృతిధనమును పొందకుండా చేయుటకు ఫెడరలు రాష్ట్రీయశాసనము లెట్టి యాటంకములు కల్పించినను

చెల్లవు. వ్యాపారపరిశ్రమల ప్రోత్సాహము కొరకింగ్లాండులో నొసగబడు ధనదానములు, బహూకృతిధనమును ఇండియాకంపెనీలు ఇంగ్లాండు కంపెనీలతోపాటు పొందుటకు ఇంగ్లాండులో ఆటంకములున్నంతవరకు మాత్రము ఈ ఉపపరిచ్ఛేదము వర్తించదు.

ఈ ప్రకరణములో చెప్పబడిన వానితో నిమిత్తము లేకుండా ఏవ్యాపార పరిశ్రమను ప్రోత్సహించుటకు ధనదానము నిర్ణయింపబడినదో ఆవ్యాపారము గాని పరిశ్రమ గాని ఈచట్టముల్లో శాసనమగు నాటికి బ్రిటీషు ఇండియాలో ఒక కంపెనీ చేయుచుండనిపక్షములో చట్టము విధించు ప్రకారము ఆకంపెనీ బ్రిటీషు ఇండియాలోగాని సంస్థానములో గాని రిజిష్టరగువరకును దాని పరిపాలక వర్గములో సగము కంటె హెచ్చుగాకుండ చట్టము విధించు నంతమంది ఇండియాలో నివసించు బ్రిటీషు పౌరులుగాని, సంస్థానపౌరులు గాని పాలకవర్గములో నుండువరకును, ఇండియాలోవసించు బ్రిటీషు పౌరులకును చట్టము విధించినచో సంస్థానముల పౌరులకును, (ఆవ్యాపార పరిశ్రమలందు) తర్ఫీయతు నొసగుటకు ఆకంపెనీ తగు అవకాశమిచ్చువరకును ఆకంపెనీ ఆ ధనదానమునకు అర్హతకలిగి యుండదని విధించవచ్చును.

ఈ పరిచ్ఛేదము నిమిత్తము ఇంగ్లాండులోని కంపెనీకి ఇండియాలోని రేవులతోసదా రాకపోకలుజరుపు ఓడ

లున్నచో ఆకంపెనీ ఇండియాలో వ్యాపారము చేయుచున్న
ట్లే ఎంచబడవలెను.

(117) ఈ పరిచ్ఛేదములో పైనజెప్పబడిన నియమములు ఈచట్టము శాసింపబడినపిదప జారీచేయబడు ఆర్డినెన్సులకును ఆర్డరులకును ఉపవిధులకును, రూల్సుకును రెగ్యులేషను లకునుకూడ వర్తించును. అయితే ప్రస్తుతము అమలులో నున్న శాసనములయొక్క నియమములనివి బాధింపవు.

(118) ఫెడరేషను స్థాపింపబడినపిదప ఇంగ్లాండు ప్రభుత్వమువారును, ఫెడరలు ప్రభుత్వమువారును ఇంగ్లాండులో నివసించు బ్రిటీషుప్రజలకును, రిజష్టరుచేయబడిన కంపెనీలకును, ఇండియాలోని బ్రిటీషుప్రజలకును రిజిష్టరు చేయబడిన కంపెనీలకును ఈపరిచ్ఛేదములో చెప్పబడిన విషయములందు పరస్పర సౌకర్యములనుగూర్చిన మర్యాదలను నిర్ణయించుచు ఒడంబడికలు చేయబడినచో ఆమర్యాదలను ఒడంబడికలను అమలుజరుపుటకు గావలసిన శాసనములు ఉభయదేశములందును, చేయబడినట్లు చక్రవర్తికి ధృవమైనచో ఆఒడంబడికనుగూర్చి ప్రీవీకవున్సిలు సభాయుతుడగు రాజాజ్ఞ [ఆర్డరుఇన్‌కవున్సిలు]ను ప్రకటింపవచ్చును. అంతట నీపరిచ్ఛేదముయొక్క అమలు ఆగిపోవును.

ఈ పరిచ్ఛేదముక్రింద జారీచేయబడు సభాయుతుడగు రాజాజ్ఞ దానికి సంబంధించిన ఒడంబడిక మరతుకాలము

పూర్తి కాగానే గాని, ఒడంబడికదారులలో ఒకరు ముగింపు చేసినగాని రద్దగును.

(119) ఏకార్యముకొరకుగాని బ్రిటీషుఇండియాలో సాంకేతిక వృత్తివిషయిక యోగ్యతలను నిర్ణయించు నట్టియు లేదా అట్లు నిర్ణయించుట కెవరికైన నధికార మొసగునట్టియు చిత్తుచట్టముగాని, సవరణగాని, లేదా, సాంకేతిక వృత్తివిషయిక యోగ్యతలను పురస్కరించుకొని ఏవృత్తినిగాని వాడుక చేయుట యందును, ఏ ఉపాధిని గాని, వ్యాపారముగాని వర్తకము గాని నిర్వహించుకొనుటయందును బ్రిటీషు ఇండియాలో ఏ ఉద్యోగము గాని చేయుటయందును, అనర్హతలను బాధ్యతలను, నిషేధములను, షరతులను నిర్ణయించునట్టియు, చిత్తుచట్టము ఫెడరలు శాసనసభలో గవర్నరు జనరలు యొక్క స్వంతంత్ర వివేచనతో నివ్వబడిన అనుమతిని ముందుగా పొందకుండాను, రాష్ట్రీయ శాసనసభలలో గవర్నరుయొక్క స్వంతంత్ర వివేచనతో నొసగబడిన అనుమతిని ముందుగా పొందకుండగను ప్రవేశపెట్ట బడరాదు.

చేయబూనిన శాసనము విధించు అర్హత, నిషేధము, బాధ్యత, అంతకు పూర్వములో చేయువృత్తిని ఉపాధిని వ్యాపారమును, వర్తకమును, ఉద్యోగమును ఇకముందు కూడ చేసికొనుటకును అట్లుచేసికొనుటలో నిర్వర్తింప వలసిన కార్యములు గూడ చేయుటకును లేదా ఆఉద్యోగ

ములో ఈపరతు నిషేధము లేనప్పుడు చేయుచుండిన కార్యములు చేయుటకును ప్రజాశ్రేయము కొరకుతప్ప ఎట్టి ఆటంకము లేకుండా చేయుబడినదని తృప్తిజెందినతప్ప గవర్నరు జనరలుగాని, గవర్నరు గాని దానికి తమ అనుమతి నొసగరాదు.

పైనచెప్పబడిన ప్రకారము సాంకేతిక వృత్తియోగ్యతలను నిర్ణయించు రెగ్యులేషనులు (కట్టుబాట్లు) అమలులోనికివచ్చుటకు ముందుగా నాలుగునెలలకు తక్కువగాకుండ వైసార్రాయిగాని గవర్నరుగాని విధించురీతిగా ప్రకటింపబడవలెను. అట్లుప్రకటింపబడిన రెండునెలలలోగా ఆరెగ్యులేషనులు గాని దానిలోనిభాగములుగాని అవివర్తించు వర్గములవారికి అన్యాయకరముగా నుండగలవని గవర్నరు జనరలుకుగాని గవర్నరుకుగాని ఫిర్యాదు చేయుబడినచో అతడాఫిర్యాదుకు తగిన కారణముకలదనిఅభిప్రాయబడినచో ఆరెగ్యులేషనులుఅమలులోనికి రావలసినకాలము లోపుగా బహిరంగ ప్రకటన మూలమున వానిని, లేదా వానిలో కొన్నిటిని, నిరాకరించవచ్చును. ఈపరిచ్ఛేదములో 'రెగ్యులేషను' లను మాటక్రింద (నిబంధనలు, ఉపనిబంధనలు, తాకీదులు, అవసరశాసనములు) రూల్సు, బైలాలు, ఆర్డరులు, ఆర్డినెన్సులుకూడా చేరును. ఈకర్తవ్య నిర్వహణమునందు గవర్నరుజనరలు, లేదా గవర్నరు తన స్వబుద్ధినే ఉపయోగింపవలెను.

గవర్నరుజనరలు తన స్వబుద్ధి నుపయోగించి పైన చెప్పబడిన పరిచ్ఛేదములోని సంగతులు ప్రస్తుతము అమలులోనున్న ఏశాసనమునకైనను వర్తించవలెనని బహిరంగ ప్రకటనము గావించినచో ఆ నియమములెల్ల ఆ శాసనమునకుకూడా వర్తించును. ఆనియమములను ఫెడరలు చట్టమునకు వర్తింపజేయుటలో గవర్నరుజనరలును, రాష్ట్రీయశాసనమునకు వర్తింపజేయుటలో గవర్నరును, లేదా వీరిలో కొంతవర కొకరును, మఱికొంతవర కింకొకరును తమ స్వబుద్ధి నుపయోగించి జేసిన ప్రకటనలు ఆయావిధముగా అమలు జరుగును.

120. ఈ పరిచ్ఛేదముయొక్క మూడవ ఉపపరిచ్ఛేదము (సబ్‌క్లాజు) లోని షరతులు అమలు జరిగినంతకాలము ఇంగ్లాండులో గాని, ఇండియాలోగాని నివసించు బ్రిటీషు పౌరుడు, అతనికి ఇంగ్లాండులో నివ్వబడిన వైద్యపట్టానను సరించి సక్రమముగా వైద్యవృత్తిని అవలంబించినవాడుగా ఇంగ్లాండులో రిజిష్టరుజేసికొన్నచోగాని, లేదా చేసికొనుటకు అర్హతయున్నగాని, ప్రస్తుతము అమలులోనున్న చట్టముక్రింద గాని మునుముందురాగల ఫెడరలు రాష్ట్రీయ శాసనముల క్రిందగాని బ్రిటీషు ఇండియాలో వైద్యవృత్తిని, శస్త్రచికిత్సను, ప్రసవ వైద్యమును జేయుటకును, అట్లు చేయుటకు అర్హతను సూచించుచు రిజిష్టరు చేసికొనుటకును, అతడు పొందినపట్టా ఆవృత్తిని చేసికొనుటకు తగిన ప్రావీ

న్యాయమునకు, విజ్ఞానమునకు తగు పూచీ నివ్వగలట్టిదిగా లేదను కారణముపైన తప్ప, ఎట్టి ఆటంకమునుండరాదు.

వైద్యవృత్తి చేసికొనుటలో గాని, రిజిష్టరు చేసికొను టలోగాని ఒకపట్టా పొందినవాడు అనర్హుడని ఫెడరలు రాష్ట్రీయ శాసనసభలు నిర్ణయింప తలచినప్పుడు ఆ పట్టా జారీచేయు విశ్వవిద్యాలయమునకును, గవర్నరుజనరలుకును నోటీసు నిచ్చిన మీదట 12 నెలలు గడచిన పిదప గాని ఆ పట్టాదారులను నిషేధించు సూచన అమలు లోనికి రా కూడదు.

ముందురాబోవు ఉపపరిచ్ఛేదము క్రింద ప్రివీకవున్సిలుకు అర్జీ యిచ్చుకొన్న మీదట ఆపట్టా అట్టి పూచీ నిచ్చు నట్టిదిగనే అంగీకరింపబడవలెనని ప్రివీకవున్సిలువారు నిర్ణయించినచో ఆసూచన అమలు జరుగరాదు.

ఒక వైద్యపట్టాను పొందిన వారిని వైద్యవృత్తినుండి గాని, రిజిష్ట్రీమునుండిగాని తొలగించుటకు చేయబడిన సూచనవలన నష్టమునొందునట్టి ఇంగ్లాండులో వైద్యపట్టాల నొసగు విశ్వవిద్యాలయముగాని ఇతర సంస్థగాని అట్టి పట్టాను పొందిన వ్యక్తిగాని ప్రివీకవున్సిలు వారికి దరఖాస్తు పెట్టుకొనవచ్చును. అంతట ప్రివీకవున్సిలువారు ఆదరఖాస్తుకు సంబంధించినట్లు తమకుతోచు ఇంగ్లాండులోని వారికిని ఇండి యాలోని అధికారులకును దానిని గూర్చి విన్నపములు

చేసికొనుటకును, సాక్ష్యము నిచ్చుటకును తగిన అవకాశమిచ్చి ఆవైద్యపట్టా వైద్యవృత్తికి, శస్త్రచికిత్సకు, ప్రసవ వైద్య మునకు గావలసిన ప్రవీణత, విజ్ఞానమునకు తగిన పూచీ నిచ్చుచున్నదో, లేదో నిర్ణయించి తమ నిర్ణయమును గవర్నరు జనరలుకు తెలియపరచవలెను. గవర్నరు జనరలు ఆయా అధికారులకు తెలియపరచి తనకిచ్చవచ్చిన రీతిగా ప్రకటన జేయవలెను.

మొదటి ఉపపరిచ్ఛేదములో చెప్పబడిన షరతు ఇండియాలో నివసించు బ్రిటీషువారులు వైద్యము, శస్త్రచికిత్స, ప్రసవవైద్యములగూర్చి పొందిన వైద్యపట్టా, ఆయావిద్యలకు గావలసిన ప్రవీణత, విజ్ఞానమునకు తగిన పూచీనిచ్చుట లేదను కారణమునుబట్టి తప్ప ఇంగ్లాండులో ఆవృత్తులు జేసికొనుటలోను, రిజిష్టరగుటలోను నిషేధింపబడ కూడదు. ఆపట్టా తగిన పూచీ నిచ్చుచున్నదా. లేదాయని విచారించుటకు ప్రివీ కవున్సిలుకు అధికారమిచ్చు శాసన నియమములు ఇంగ్లాండువారు చేసియుండవలెను.

ఇంగ్లాండులోగాని, ఇండియాలోగాని పట్టాపొంది వృత్తి జేసికొనుటకు రిజిష్టరగుటకు హక్కుగల వ్యక్తికి ఒక దేశములో లేని బాధ్యతలుగాని. అనర్హతలుగాని నిర్బంధములుగాని రెండవ దేశములో నుండరాదు.

ఈనియమములెల్ల పైవిధముగా పట్టాలు పొందిన బర్మావైద్యులకుకూడా వర్తించును.

ఇంగ్లాండులోగాని ఇండియాలోగాని అందుకొరకు నియమింపబడిన అధికారులు ఒకవైద్యుని దుర్నడతను కారణముగాగైకొని వృత్తి జేసికొనుటనుగాని రిజిష్టరగుటనుగాని నిషేధించుట కెట్టియాటంకము నుండరాదు.

ఈ పరిచ్ఛేదములో (డిప్లమా) పట్టా అనుదానిక్రింద నిదర్శనపత్రములు (సర్టిఫికెట్లు) డిగ్రీలు (పట్టములు); స్కాలర్‌షిప్పులును, పరీక్షలందుత్తీర్ణులగు వారికొసంగబడు ఇతర పత్రము, హోదాలునుగూడ చేరును.

121. "ఇండియను మెడికలు సర్వీసులో" గాని, చక్రవర్తియొక్క సైనికవర్గమునకు చెందిన ఇతర శాఖలలోగాని చక్రవర్తియొక్క వైద్యుడుగా (కమీషను) సన్నదునుపొంది పనిచేయువారు ఆయధికారమునుబట్టి బ్రిటీషు ఇండియాలో వైద్యము, శస్త్రచికిత్స, ప్రసవవైద్యము చేయుటకును, రిజిష్టరగుటకును అర్హతకలిగియుండును.

## సివిలు సర్వీసు ఉద్యోగులు.

240. (1) ఈచట్టముక్రింద స్పష్టముగా విధింపబడిన సందర్భములలోగాక ఇండియా ప్రభుత్వముయొక్క సివిలుసర్వీసులోని సభ్యులును, ప్రభుత్వోద్యోగులును చక్రవర్తియొక్క చిత్తమువచ్చినంత కాలము ఉద్యోగము చేయవచ్చును.

2. ఉద్యోగమునిచ్చి నియమించిన అధికారుల క్రింది తాబేదారీయధికారు లాయుద్యోగులను బర్తరఫు (డిస్మిసు) చేయరాదు. [illegible]

3. అట్టి ఉద్యోగిపైన తీసుకొనబోవు చర్యవిషయములో అతడు తగుకారణము చెప్పుకొనుటకు తగిన అవకాశమివ్వకుండా అతనిని ఉద్యోగమునుండి తొలగింపరాదు; హోదాలోనుండి తగ్గింపరాదు. అయితే (i) క్రిమినలు ఫిర్యాదుక్రింద శిక్షనుపొందిన ఉద్యోగిని తొలగించుటలోను, హోదాలోనుండి తగ్గింపుచేయుటలోను ఇదివర్తింపదు. (ii) మరియు ఆ ఉద్యోగులను తొలగించుటకు, తగ్గించుటకు అధికారమివ్వబడిన యే అధికార సంస్థయైనను ఆ ఉద్యోగికి తగు అవకాశ మిచ్చుటకు వీలులేదను కారణములను లిఖిత పూర్వకముగా నిర్ణయించినప్పుడు ఇది వర్తింపదు.

4. సివిలు సర్వీసు ఉద్యోగులందరును చక్రవర్తి చిత్తమువచ్చినన్నాళ్ళు ఉద్యోగము చేయవీలున్నను, ఇండియా

ప్రభుత్వముయొక్క సివిలుసర్వీసులో సభ్యులుగానివారు ఏదైనా ఖరారునామా ప్రకారము ఈచట్టముక్రింద నేదైనా ఉద్యోగమునకు నియమింపబడినచో, ఆఖరారునామా కాలములోపుగానే ఆస్థానమున ప్రత్యేక యోగ్యతలుగలవాని నెవ్వనినైన నియమించుట యుక్తమని గవర్నరుజనరలుగాని గవర్నరుగాని అభిప్రాయపడి, అతని నాయుద్యోగమునుండి ఖాళీచేయవలసినగాని, ఆహోదా రద్దుచేసినగాని, అతనికి తగు నష్టపరిహారము నొసగవలెను.

241. ఫెడరలు ప్రభుత్వముయొక్క ఉద్యోగులను గవర్నరుజనరలును, అతడు నియమించినవారును, రాష్ట్రీయ ప్రభుత్వముయొక్క ఉద్యోగులను గవర్నరును, అతడు నియమించినవారును నియామకము చేయవలెను. ఉద్యోగములకు సంబంధించిన నిబంధనలును వారే చేయవలెను. వారిహక్కులలో మార్పులుచేయునిబంధనలు 1926 మార్చినాటికి అట్టి నిబంధనలుచేయుట కధికారముగల వారివలనను, రాజ్యాంగ కార్యదర్శివలనను, అతడు నియమించినవారివలననుమాత్రమే చేయబడవలెను. ఆఉద్యోగులకు పూర్వమువలెనే అప్పీలు హక్కులుండవలెను. ఫెడరలు రాష్ట్రీయ శాసనసభలుచేయు శాసనములు గవర్నరుజనరలుకును గవర్నరులకును గల అధికారములను బాధింపరాదు.

242. క్రిందటి పరిచ్ఛేదములోని అంశములు ఫెడరేషను యొక్క రైల్వేసర్వీసులకును వర్తించుటలో 2 వ ఉపపరిచ్ఛే

దములోను మొదటిపేరాలోను, 5-వ ఉపపరిచ్ఛేదములోను, గవర్నరుజనరలు అనుటకు బదులు ఫెడరల్ రైల్వే అథారిటీ అని అన్వయించవలెను.

2. రైల్వేలోని ఉన్నత తరగతి యుద్యోగముల నియామకము విషయములో నిబంధనలు చేయుటలో ఫెడరలు రైల్వే అథారిటీవారు ఫెడరల్ పబ్లికు సర్వీస్ కమీషనువారి నాలోచించవలెను. ఉద్యోగములిచ్చు సందర్భములో రైల్వే శాఖలతో చిరకాలమునుండి ఆంగ్లోఇండియను సంఘమునకు గల సంబంధమును యోజించుటయు, ముఖ్యముగా ఆసంఘమువారదివరకు పొందియున్న ఉద్యోగములయొక్క ప్రత్యేక తరగతులు, స్వభావము, నూటికెన్నివంతులుగ నుండినది అను అంశములును గమనించవలెను. మరియు ఫెడరలు రైల్వేల ఉద్యోగములందు ఇండియాలోని వివిధసంఘము లకు న్యాయమగు ప్రాతినిధ్యముండుటకొరకు గవర్నరు జనరలొసగు సలహాలను గూడ గమనింపవలెను. అంతేగాని మరేవిధముగాను ఫెడరలు పబ్లికు సర్వీసు కమీషనువారి సహాయము పొందవలసిన బాధ్యత ఫెడరలు రైల్వే అథారిటీవారికి లేదు.

3. కస్టమ్సు, తపాలా, తంతి శాఖలందలి ఉద్యోగములకు నియామకము చేయుటకు నిబంధనలు చేయుటలో గవర్నరుజనరులును, అందుకొరకు ఆతడధికారమిచ్చిన వారును యీ ఉద్యోగముల విషయములో ఆంగ్లోఇండియను

సంఘమునకు గల చిరకాలసంబంధమును, ముఖ్యముగా ఆ సంఘమిదివరకు పొందియున్న ఉద్యోగములయొక్క ప్రత్యేకతరగతులు, స్వభావము, నాటికెన్నివంతులుండెనో అను నదియు వానికివ్వబడు వేతనముల యొక్క సంగతియు గమనించవలెను.

4. ఫెడరలు కోర్టులోగాని హైకోర్టులోగాని పని చేయు ఉద్యోగివర్గము విషయములో ఈపరిచ్ఛేదములోని విషయముల అన్వయించుటలో గవర్నరు జనరలు, గవర్నరు అను పదములకు బదులు ప్రధాన న్యాయమూర్తి అని అన్వయించుకొనవలెను.

ఫెడరలు కోర్టువిషయములో గవర్నరుజనరలును హైకోర్టు విషయములో గవర్నరును తమ స్వతంత్ర వివేచన నుపయోగించి సర్వీసు కమిషనులను యోచించి పాత్రివారినే ఉద్యోగములకు నియమించు నట్లు సూచనలు చేయవచ్చును.

2 వ ఉపపరిచ్ఛేదము ననుసరించి జీతములు, అలవెన్సులు, సెలవులు, పింఛనులను గూర్చి ప్రధాన న్యాయమూర్తి చేయు నిబంధనలు గవర్నరు జనరలు లేక గవర్నరు యొక్క ఆమోదము పొందవలెను.

243. ఇండియాలోని వివిధ తాబేదారీ పోలీసు ఉద్యోగుల షరతులు ఆ పోలీసు బలములకు సంబంధించిన చట్టములనుబట్టి నిర్ణయింపబడవలెను.

ఈ చట్టము యొక్క 3 వ భాగము అమలులోనికి రాగానే రాజ్యాంగకార్యదర్శికి సంక్రమించు అధికారములు:

244. 1. ఇండియా సివిలుసర్వీసు, మెడికలుసర్వీసు, పోలీసు సర్వీసులలో ఉద్యోగులను నియమించుటకు పార్లమెంటువారు ఇతర ఏర్పాటు చేయువరకు ఇంగ్లాండులోని ఇండియా రాజ్యాంగకార్యదర్శికి అధికారము కలదు.

2. పార్లమెంటువారు ఇతర ఏర్పాటు చేయువరకు గవర్నరుజనరలు స్వతంత్ర వివేచన నుపయోగించ వలసిన కార్యములందు పనిచేయుటకును అవసరముగా నెంచి రాజ్యాంగకార్యదర్శి స్థాపించు ఉద్యోగవర్గమునందు పని చేయుటకును నియమించవచ్చును.

3. ఉద్యోగవర్గము యొక్క సంఖ్యను రాజ్యాంగకార్య దర్శి అప్పుడప్పుడు నిర్ణయించుచుండవలెను. అట్లు నియ మింపబడిన ఉద్యోగములయొక్కయు, ఖాళీలయొక్కయు వివరములు ప్రతియేటను పార్లమెంటువారియెదుట పెట్టు చుండవలెను.

4. ఈపరిచ్ఛేదము ఎట్లు అమలు జరుగుచున్నదీ గవర్నరు జనరలు రాజ్యాంగకార్యదర్శి కప్పుడప్పుడు తెలియ

చేయుచుండవలెను. తన రుచిలెఖసి తోచిన కాలపరిమితి పిదప దీనిలో నేదైన మార్పులవసరమని తోచినచో అందు నుగూర్చి శిఫారసు చేయవలెను.

ఈ కార్యములు నిర్వహించుటలో గవర్నరు జనరలు తన స్వతంత్రవివేచననే ఉపయోగింపవలెను.

245. (ఇర్రిగేషను) వ్యవసాయ నీటిపారుదల విషయములో కార్యసామర్థ్యత యుండుకొరకు పాగ్గమైటు వాటితర ఏర్పాటు చేయువరకు రాజ్యాంగకార్యదర్శియే ఇరిగేషనుకు సంబంధించిన సివిలుఉద్యోగవర్గములను, ఉద్యోగివహోదాయందును తగినవారిని నియమించవచ్చును.

246. గవర్నరు జనరలు స్వతంత్రవివేచన నుపయోగించు కార్యములందు పనిచేయుకొర కేర్పడిన ఉద్యోగములు తప్ప ఈ పరిచ్ఛేదనియమములకు లోబడి రాజ్యాంగకార్యదర్శి నియమించవలసిన ఇండియాప్రభుత్వముక్రింద పనిచేయు సివిలు సర్వీసు ఉద్యోగవర్గమునందలి, లేదా, సివిలు ఉద్యోగస్థానము లందలి యుద్యోగములయొక్క స్వభావము, సంఖ్యలను వివరించుచు రాజ్యాంగకార్యదర్శియే నిబంధనలను చేయువలయును. ఆ నిబంధనలందు చెప్పబడిన సందర్భములప్రకారముగా తప్ప రాజ్యాంగకార్యదర్శియొక్క అనుమతిలేనిదే ఆఉద్యోగస్థానము 3 నెలల కన్న హెచ్చుకాలము ఖాళీగానుంచబడరాదు.

పైన చెప్పబడిన వ్యక్తులకుతప్ప ఇతరులను అందుకు నియమించరాదు. దీనిని ఇంకొక ఉద్యోగహోదాతో కలుపరాదు.

2. ఫెడరేషను వ్యవహారములకు సంబంధించిన ఉద్యోగముల విషయములో గవర్నరుజనరలును, రాష్ట్రీయవ్యవహారములకు సంబంధించిన ఉద్యోగముల విషయములో గవర్నరులును తమ స్వబుద్ధినుపయోగించి తామే పైన చెప్పబడిన ప్రత్యేకోద్యోగస్థానములందు నియామకములను, బదలాయింపులను చేయుచుండవలెను.

3. ఈ పరిచ్ఛేదముక్రింద చేయబడు అన్నినిబంధనలను చేయబడినవెంటనే పార్లమెంటుయొక్క ఉభయ సభల యెదుటను పెట్టబడవలెను. సభ యెదుట అట్లు దాఖలుచేయబడిన 28 రోజులలో నాపార్లమెంటుసభ ఆ నిబంధన రద్దు చేయబడవలెనని తీర్మానించినచో ఆ నిబంధన రద్దగును. అయితే దానినిబట్టి అంతవరకు జరుపబడిన చర్య చెల్లకుండపోదు. మరియు క్రొత్తనిబంధన చేయుటకు నాటంకముండదు.

247. రాజ్యాంగకార్యదర్శి ఏర్పాటుచేసిన ఉద్యోగవర్గములందు, ఉద్యోగస్థానములందు నియమించిన వారి ఉద్యోగ షరతులు, వారిజీతములు, సెలవులు, పింఛనులు, వైద్యసహాయము విషయములో రాజ్యాంగకార్యదర్శిచేయు నిబంధనలను బట్టి అమలు జరుపవలెను.

ఈ ప్రకరణములో స్పష్టముగా చెప్పబడిన ఇతర విషయములందు రాజ్యాంగకార్యదర్శి యిష్టప్రకారము ఆతడు చేయు నిబంధనలనుబట్టి యుండవలెను. ఆ నిబంధనలందేమియు చెప్పబడనియెడలగాని, లేదా, నిబంధనలే చేయబడని యెడలగాని ఫెడరేషను వ్యవహారములందు పనిచేయువారి విషయములో గవర్నరుజనరలును, రాష్ట్రీయ వ్యవహారములందు పనిచేయువారి విషయములో గవర్నరులును, లేదా వారు అధికారమొసగి నియమించినవారును చేయు నిబంధనల ననుసరించి యుండవలెను.

అయితే రాజ్యాంగకార్యదర్శి నియమించిన ఉద్యోగి నియమింపబడు తేదినాటికి అమలులో నుండిన నిబంధనలను బట్టి ఏర్పడియున్న అతని జీతము, పింఛనులకన్న హీనముగానుండు నట్లీఉపపరిచ్ఛేదముక్రింద నేనిబంధనయు జేయ బడరాదు.

2. రాజ్యాంగకార్యదర్శి నియామకము జేసిన ఉద్యోగి కివ్వబడు ప్రమోషనులు (వేతనవృద్ధులు) 3 నెలల వరకు తక్కువగాని సెలవును గూర్చిన ఉత్తరువులుగాని లేదా అతని ఉద్యోగమునుండి కొన్నాళ్ళు సస్పెండు చేయుటగాని, అతడు ఫెడరలు వ్యవహారములకు సంబంధించిన వాడైనచో గవర్నరు జనరలును, రాష్ట్రీయ వ్యవహారములకు సంబంధించిన వాడైనచో గవర్నరులును వారి స్వబుద్ధి నుపయోగించిన చెదప చేయవలెను.

3. పైన చెప్పబడిన యే ఉద్యోగి యైనను సస్పెండు చేయబడినచో ఆ కాలములో గవర్నరు జనరలుగాని, గవర్నరుగాని తమ స్వబుద్ధి నుపయోగించిన పిదప నిర్ణయించినంత మట్టుకు తప్ప అతని జీతము లు తగ్గింపబడరాదు.

4. అట్టి ఉద్యోగి ఖర్చులు వ్యవహారములకు సంబంధించినవారైనచో ఖర్చులు రెవిన్యూపైనను, రాష్ట్రీయ వ్యవహారములకు సంబంధించిన వారైనచో రాష్ట్ర రెవిన్యూలపైనను వారిజీతములు, బత్తెములు (అలవెన్సులు) బద్ధత చేయబడవలెను. అయితే వారు రైల్వేశాఖలోని వారైనచో రైల్వేనిధిలో నుండి వారికొసగబడని మొత్తమువరకు ఖర్చులు రెవిన్యూపైన ఆధారపరుపబడవలెను.

5. పైన చెప్పబడినవారికి కొసగవలసిన పింఛనులు (ఉపకార వేతనములు)ను, పింఛను ఫండు క్రిందను, ప్రావిడెంటు ఫండుక్రిందను ప్రభుత్వములు చెల్లించవలసిన మొత్తములును ఖర్చులు రెవిన్యూపైన ఆధారపరువబడవలెను.

6. రాజ్యాంగ కార్యదర్శి అనుమతితో తప్ప ఈపరిచ్ఛేదముక్రింద చేయబడు నిబంధనలక్రింద నిర్ణయింపబడు పింఛనుయొక్క అధికతమ మొత్తముకన్న తక్కువ అవార్డు చేయబడరాదు.

7. ఇండియాలో చక్రవర్తి కొలువులోనుండు ఉద్యోగినిగూర్చి రాజ్యాంగకార్యదర్శి తనకు యుక్తము, న్యాయము అని తోచిన చొప్పున జరిగించుటలో రాజ్యాంగకార్యదర్శి యొక్క అధికారములను ఈపరిచ్ఛేదముక్రింద చేయుబడు నిబంధనలు తగ్గించులాగునగాని, పరిమితము చేయుబడులాగున గాని అన్వయింపబడరాదు. మరియు ఈపరిచ్ఛేదముక్రింద రాజ్యాంగకార్యదర్శి వలనగాక ఇంకెవ్వరివలన చేయుబడిన నిబంధనలెవ్వియు, గవర్నరు జనరలును, గవర్నరును అట్టి ఉద్యోగివిషయములో యుక్తము, న్యాయము అని తోచిన విధముగా జరిగించుటలోని అధికారమును పరిమితముచేయులాగున గాని, తగ్గించులాగునగాని అన్వయింపబడరాదు. మరియు ఈ పరిచ్ఛేదముక్రింద జేయబడి ఏయుద్యోగికైన వర్తించు నిబంధన యున్నదో అందులో విధింపబడియున్న దానికన్న ఎక్కుడు బాధకరముగా నుండునట్లాయుద్యోగి వ్యవహారము తీర్మానింపబడరాదు.

248. రాజ్యాంగకార్యదర్శి నియమించిన యుద్యోగులు తమ యుద్యోగ షరతులను బాధించు ఉత్తరువులేవైన చేయబడినచో గవర్నరు జనరలుకు ఫిర్యాదుగాని, అప్పీలు గానిచేసికొనవచ్చును. గవర్నరుజనరలీవిషయమును తన స్వబుద్ధినుపయోగించియే తీర్మానించును.

2. ఫెడరలు ప్రభుత్వముక్రింద పనిచేయువారి విషయములో గవర్నరుజనరలును, రాష్ట్రీయప్రభుత్వముక్రింద పని

జేయువారి విషయములో గవర్నరునుతప్ప మరియెవ్వరును ఆయుద్యోగజీతమునకు, ప్రతిఫలమునకు, మహాజరునకు భంగ కరమగు విమర్శగాని, దండనగాని జేయరాదు.-

3. దానిపైన రాజ్యాంగకార్యదర్శికి అప్పీలుండును.

4. ఐ. సి. ఎస్. వారి కివ్వవలసిన సొమ్ము ఫెడరలు లేక రాష్ట్రరివిన్యూపైన ఆధారపరుపబడవలెను.

249. ఈచట్టముక్రింద తీసికొనబడిన చర్యలవలన తాను నియమించిన ఉద్యోగులకేదైన నష్టము కలిగినట్లు తోచిన చో రాజ్యాంగకార్యదర్శి వారికిగాని, వారి వారసులకుగాని నష్టపరిహారమిప్పించవచ్చును.

2. అట్లు ఇవ్వవలసివచ్చు సొమ్ము రివిన్యూపైన ఆధారపరుపబడవలెను.

3. అయితే అట్టి నష్టపరిహారము రివిన్యూలోనుండి గవర్నరుజనరలుగాని, గవర్నరుగాని ఇచ్చుటకే యభ్యంత రమును లేదు.

250. పైనచెప్పబడిన నాలుగు పరిచ్ఛేదములలోని విధు లును దీనినిబట్టి చేయబడు నిబంధనలును రాజ్యాంగకార్యదర్శి ఈచట్టము అమలులోనికి రాకముందు నియమించిన వారికిని,

ప్రత్యేకింపబడిన ఉద్యోగములందు నియమింపబడిన వారికిని కూడావర్తించును.

2. ఈ పరిచ్ఛేదముయొక్క నియమములకు లోబడి ఈపైన చెప్పబడిన నాలుగు పరిచ్ఛేదములందలి విధులును, నిబంధనలును, రాజ్యాంగకార్యదర్శి చేయనిశ్చయించిన మార్పులకులోబడి రాజ్యాంగకార్యదర్శి నియమించని ఉద్యోగులయినను, ప్రత్యేకింపబడిన ఉద్యోగస్థానములందున్న వారి విషయములోను, ఇండియా ప్రభుత్వముక్రింద సివిలు ఉద్యోగము చేయుచు అప్పుడుగాని అంతకుముందుగాని చక్రవర్తి యొక్క సైనికబలములందొక హోదాను పొందియుండు వారి విషయములలోను కూడావర్తించును.

3. ఈచట్టముయొక్క 3-వ భాగము అమలులోనికి రాక పూర్వము నియమింపబడిన సివిలు ఉద్యోగులకు వారి జీతములు వగయిరాలందు, పింఛనులందు, వారునియమింపబడునాటి కుండు పరిస్థితులకన్న హీనకరమగునట్లు అన్వయింప బడకూడదు.

4. ఫెడరలు రైల్వేశాఖలో పనిచేయు ఉద్యోగుల విషయములోకూడ ఈవిధులు వర్తించును. గవర్నరు జనరల్ అను పదమునకు బదులు ఫెడరల్ రైల్వే అథారిటి అని అన్వయించవలెను.

5. ఈ చట్టము యొక్క 3-వ భాగము అమలులోనికి రాక పూర్వము రాజ్యాంగ కార్యదర్శిచే నియమింపబడిన ఉద్యోగుల విషయములో ఫెడరేషనుకు గాని, రాష్ట్రములకు గాని యుండియున్న బాధ్యతలు 7-వ భాగమునందలి దావా నగాదాల కొరకు పూర్తి బాధ్యతగనే భావించబడును.

251. ఈ భాగములోని నిబంధనలు ఇంగ్లాండులోనుండు ఇండియా హైకమీషనరు యొక్కయు ఇండియా హౌం అకౌంట్సు ఆడిటరుయొక్కయు సిబ్బందిలోని ఉద్యోగులకును వర్తించును. అట్టి సిబ్బంది యుద్యోగులు, గవర్నరు జనరలు స్వతంత్ర వివేచనతో నొసగు అనుమోదముతో నియమింపబడవలెను.

252. ఈ చట్టము అమలులోనికి రాక పూర్వము నియమింప బడియున్న హైకమీషనరు సిబ్బందిలోని ఉద్యోగులును, రాజ్యాంగ కార్యదర్శి లెక్కల ఆడిటరు సిబ్బంది యుద్యోగులును ముందుకూడా ఆ ఉద్యోగములు చేయువలెను. వారి ఉద్యోగ షరతులకు, జీతములకు, పింఛనులకు భంగము కలుగరాదు. ఈ ఖర్చులు ఫెడరలు రెవిన్యూలపైన ఆధారపడవలెను.

253. ఈ ప్రకరణము లోని విధులు ఫెడరలు కోర్టుయొక్కయు, హైకోర్టుయొక్కయు జడ్జీలకు వర్తించవు. అయితే అట్టి జడ్జీలుగాక పూర్వము ఇండియాప్రభుత్వము క్రింద సివిలు

ఉద్యోగులుగానుండిన వారియొక్క జీతములు, సెలవులు, పింఛనులను గూర్చి వీటికన్నిటిలు సభాయుమునకు రాజాజ్ఞను జారీచేయుటకెట్టి అభ్యంతరమునుండరాదు.

బ్రిటీషుపౌరులు గానివారుకూడా జడ్జిలగుట నియమము లాటంకము గలిగింపరాదు. ఈచట్టములలోనికి రాక పూర్వమివ్వబడు పింఛనుల సందలి నిబంధనలు బాధింపరాదు. అవి ఫెడరలు రివిన్యూపైన బద్ధతచే కూడబడవలెను.

254. జిల్లాజడ్జిలను గవర్నరు స్వబుద్ధిననుయోగించి నియమించవలెను. ఎవరిపేరైన గవర్నరునకు పంపుటకు ముందు మంత్రులు హైకోర్టువారిని ఆలోచించవలెను.

255. రాష్ట్రీయ పబ్లికుసర్వీసు కమీషనువారితోను, హైకోర్టుతోను యోజించి గవర్నరు, రాష్ట్రము లోని జిల్లాజడ్జీలకింది న్యాయాధిపతులుగా చేరదలచువారి అర్హతలు ఉద్యోగషరతులను గూర్చిన నిబంధనలు చేయువలెను.

256. జిల్లామేజస్ట్రీటును ఆలోచించిగాని ఎవ్వరికిని మేజస్ట్రీటు అధికారములిచ్చుటగాని, తగ్గించుటగాని జరుగరాదు.

257. ఈ నిబంధనలు రాజకీయశాఖ అనగా సంస్థానములకు, ప్రభుత్వమునకుగల సంబంధములందు పనిచేయు ఉద్యోగులకు వరించవు.

వారి ఉద్యోగపరతులు, జీతములు, పింఛనులు పూర్వ మున్నట్లు లేయుంచవలెను. పూర్వముగ్న వారి విషయములో రాజ్యాంగ కార్యదర్శికిగల అధికారము లిప్పుడు ఆతనికి సలహా నిచ్చువారి అంగీకారముతో అతడు చలాయించును.

258. ఈ చట్టముయొక్క 3వ భాగము అమలులోకి రాక పూర్వమున్న సెంట్రల్ సర్వీస్ 1. రైల్వే సర్వీస్ క్లాస్ 1. ఉద్యోగములు షెడరలు వ్యవహారములకు సంబంధించినవి. గవర్నరుజనరలుయొక్క స్వబుద్ధి నుపయోగించికాని రద్దు చేయబడరాదు. రాష్ట్రములకు సంబంధించిన ఉద్యోగములు గవర్నరు స్వబుద్ధి నుపయోగించికాని రద్దుచేయబడరాదు. మరియు వారికిచ్చు జీతములు, అలవెన్సులు, పింఛనులను బాధించు నిబంధనలను చేయరాదు.

ఈ పరిచ్ఛేదములో చెప్పబడిన యుద్యోగులలో ఎవ రైన రాజ్యాంగకార్యదర్శి వలన నియమింపబడినవారున్నను లేదా చరిత్ర సైన్యములకు జెందిన వారున్నను ఈపరిచ్ఛేదములో గవర్నరు జనరలుకున్నట్లు చెప్పిన అధికారములు రాజ్యాంగకార్యదర్శికి యున్నట్లుగా అన్వయించవలెను.

259. 1924 సంవత్సరము ఏప్రియల్ 1వ తేదికి పూర్వము నియమింపబడిన ఉద్యోగులయొక్క హోదాలు అప్పటినుండి యీచట్టము అమలులోనికి వచ్చులోపుగా "సుపీరియర్ సర్వీసు" గ వర్గీకరింపబడియున్నచో వారి జీతములు, అల

పెన్షనులుకూడా ఫెడరలు రెవిన్యూ పైనగాని, రాష్ట్రీయ రెవిన్యూ పైనగాని ఆధారపరుపబడవలెను. వారిలో రైలుశాఖలో నున్నవారి జీతముల విషయములో రైల్వేనిధిలోనుండి చెల్లింపక దిగబడిన భాగము ఫెడరలు రెవిన్యూపైన ఆధారపరుపబడవలెను.

పై షరతులు 1924 కు పూర్వము పింఛను పుచ్చుకొన్నవారి విషయములోకూడా ఆ ఉద్యోగములు అట్టి తరగతికి చెందినవని రాజ్యాంగకార్యదర్శి నిర్ణయించినచో వర్తించును.

260. అదే విధముగా ఈ చట్టము అమలులోనికి వచ్చు లోపల పింఛను పుచ్చుకొన్నవారి కివ్వవలసిన పింఛను ఫెడరలు, లేదా, రాష్ట్రీయ రెవిన్యూలనుండి చెల్లింపబడవలెను.

గవర్నరు స్వతంత్రవివేచనను స్వబుద్ధిని ఉపయోగించవలసిన ఇతర విషయములు:

262. ఒక స్వదేశసంస్థానాధిపతిగాని ఒక సంస్థానములోని వ్యక్తిగాని లేదా భారతదేశమునకు దగ్గరగనున్న ఒక జాతివాడుగాని రాష్ట్రవ్యవహారములకు సంబంధించిన ఒకసివిలు ఉద్యోగమును పొందుటకు అర్హుడని గవర్నరు స్వబుద్ధిని ఉపయోగించి తీర్మానించవచ్చును.

ఇట్లే ఇంగ్లాండులోని రాజ్యాంగకార్యదర్శికి కూడ ఎవరినైనను ఏఉద్యోగమునకైనను నియమించు అధికార మొసగబడినది.

265. ప్రొవిన్షియల్ పబ్లిక్ సర్వీసు కమీషను అధ్యక్షుడు ఇతర సభ్యులు అసభ్యుల యుద్యోగకాలము షరతులు వారి సిబ్బందినిగూర్చి గవర్నరు స్వతంత్ర వివేచన నుపయోగించి చేయును.

266. కొన్ని ఉద్యోగములకు మనుష్యులను నియమించుటలో పబ్లికుసర్వీసు కమీషనువారితో ఆలోచించనక్కరలేకుండా గవర్నరు స్వతంత్ర వివేచన నుపయోగించి కొన్ని నిబంధనలను చేయవచ్చును.

267. పబ్లికు సర్వీసు కమీషనువారి అధికారములను హెచ్చుచేయు చట్టమేదియు గవర్నరుయొక్క స్వతంత్ర వివేచననుబట్టి యొసగబడు అనుజ్ఞను ముందుగా పొందనిది శాసనసభలో ప్రవేశపెట్టరాదు.

270. రాష్ట్రములోని ఉద్యోగులు తమ ఉద్యోగరీత్యా చేసిన కార్యములను పురస్కరించుకొని ఎవరైనను వారిపైన దావావేయదలచిన గాని ఫిర్యాదు చేయదలచినగాని గవర్నరు స్వతంత్రవివేచన నుపయోగించి యిచ్చు అనుజ్ఞను ముందుగా పొందనిది అట్లు చేయరాదు.

271. (1) క్రిమినలు ప్రొసీజరుకోడ్డు 197 వ శెక్షనును బట్టి లేదా సివిలు ప్రొసీజరుకోడ్డు 80-82 శెక్షనుల ప్రకారము కొందరు ప్రభుత్వోద్యోగుల కొసగబడిన రక్షణను రద్దు చేయునట్టి లేదా తగ్గించునట్టి బిల్లు, గవర్నరుయొక్క స్వతంత్ర వివేచననుబట్టి ఒసగబడు అనుజ్ఞను ముందుగా పొందనిది శాసనసభలో ప్రవేశపెట్టబడరాదు.

(2) క్రిమినలుప్రొసీజరుకోడ్డు 197 వ శెక్షను గవర్నరుజనరలు గవర్నరుల అనుజ్ఞనుపొంది శాసనసభలు మార్పుచేయునవుడు ఫెడరలు ఉద్యోగుల ప్రాసిక్యూషను లందు గవర్నరుజనరలును రాష్ట్రోద్యోగుల విషయమున గవర్నరును వారిని విచారించవలసిన కోర్టును, వ్యక్తిని విధానమును తమ స్వబుద్ధి నుపయోగించి నిర్ణయించవలెను.

(3) ఒక రాష్ట్రీయ పబ్లికు ఆఫీసరు ఉద్యోగరీత్యా చేసిన కార్యమునుగూర్చి ఒక దావా వేయబడినచో అందులో అతడిచ్చుకొనవలసినట్లు నిర్ణయింపబడే ఖర్చులలో అంతగాని కొంతగాని రాష్ట్రముయొక్క రివిన్యూలోనుండి చెల్లించవలసినదనియు దానిని రివిన్యూపైన బద్ధత చేయవలసినదనియు గవర్నరు తన స్వబుద్ధిని వినియోగించి నిర్ణయించవచ్చును.

రాష్ట్రీయ స్వపరిపాలనములోని ఇతర (మినహా యింపులు :

297. (అ) రాష్ట్రములోని వ్యాపారము వాణిజ్యమును గూర్చి సరుకుల ఉత్పత్తి, సరఫరా, వినియోగములనుగూర్చి శాసనము చేయుటకు రాష్ట్రీయశాసనాధికారముల జాబితా లో చేర్చబడిన అధికారమును పురస్కరించుకొని ఒకరకము సరకునుగాని ఒకతరగతి సరకులనుగాని రాష్ట్రములోనికి దిగుమతి చేయుటకు రాష్ట్రమునుండి ఎగుమతి చేయుటను నిషేధించుట కధికారములేదు.

(ఆ) ఈ చట్టమునందు చెప్పబడిన ఏఅంశమువలనను రాష్ట్రములోనే తయారుచేయబడు, ఉత్పత్తియగు సరకులకు రాష్ట్రము వెలుపలనే తయారగు ఉత్పత్తియగు అదేమాదిరి సరకులకును మధ్యవిచక్షణ చూపులాగునను లేదా ఒక చోటినుండి వచ్చుసరకులకు నింకొకచోటినుండి వచ్చు సర కులకును మధ్య తారతమ్యము చూపునట్లుగను ఏవిధమైన సుంకముగాని పన్నుగాని సెస్సుగాని విధింపరాదు. ఇందుకు విరుద్ధముగా చేయబడిన శాసనము లంతవరకు చెల్లవు.

300. (1) గవర్నరు తనస్వబుద్ధిలో ఉత్తర్వుచేసిన తప్ప 1870 జనేవరు 1వ తేదికి పూర్వము ఒక భూమివిషయములో గాని దానిరివిన్యూ విషయములోగాని చేయబడిన గ్రాంటు లేక దానిస్వామిత్వ హక్కునిర్ణయముగాని నౌకరీకి ప్రతి

ప్రముగా ఆ తేదీకి దరిమిలా నివ్వబడిన గ్రాంటు స్వామిత్వ స్వయమునకు భంగకరముగా రాష్ట్రముయొక్క పరిపాలనా కారము చలాయింపబడరాదు.

30౭. గవర్నరుకార్యదర్శి సిబ్బందియొక్క నియామకము, జీతములు, అలవెన్సులు, కార్యాలయవసతి, ఇతర సౌక ర్యములు గవర్నరు స్వతంత్ర వివేచన ననుసరించి చేయవల సిన కార్యములే.

308. రాజ్యాంగ చట్టములో చేయవీలుగలిగినట్లు నిర్ణ యింపబడిన మార్పులవలన అల్పసంఖ్యాక జనసంఘముల హక్కులపై నెట్టిపరిణామమును కలుగ చేయగలదో గవర్నరు తన స్వతంత్ర వివేచన నుపయోగించి రాజ్యాంగకార్యదర్శికి తెలియపరుపవలెను.

## న్యా య ప రి పా ల న శా ఖ

---

హైకోర్టులు: రాజ్యాంగచట్టముయొక్క 219 వ శెక్షను ప్రకారము మద్రాసు, బొంబాయి, అలహాబాదు, కలకత్తా లాహోరు, పాట్నా హైకోర్టులతోపాటు అయోధ్య, మధ్య రాష్ట్రములు పశ్చిమోత్తరపరగణా సింధురాష్ట్రములందలి జుడిషియల్ కమీషనరు కోర్టులుకూడా ఉన్నత న్యాయస్థాన ములుగా చేయబడినవి. ఇంగ్లాండు చక్రవర్తి యిష్టప్రకా

రము ఇంకా ఇతర కోర్టులనుగూడా హైకోర్టులుగా చేయ వచ్చును.

220. ప్రతి హైకోర్టున ఒక ప్రధాన న్యాయాధిపతిని ఇంకా తనయిష్టము వచ్చినంతమంది సాధారణ న్యాయాధిపతులను చక్రవర్తియే నియమించును. ఈ న్యాయాధిపతులు చక్రవర్తి చిత్తము వచ్చినంతకాలము 60 సంవత్సరముల వయస్సు వచ్చువరకు ఉద్యోగము చేయుదురు. 10 సంవత్సరముల అనుభవముగల ఐ. సి. యస్. ఉద్యోగులుగాని, వకీళ్ళుగాని, బారిష్టరులుగాని న్యాయాధిపతులుగా నియమింపబడవచ్చును.

221. న్యాయాధిపతుల జీతములు, బత్తెములు, (పింఛనులు) ప్రవాస వేతనములు, సెలవులు, సభాయుతుడగు చక్రవర్తి జారీచేయు ఆర్డర్ ఇన్ కౌన్సిల్లను బట్టి నిర్ణయింపబడుచుండును.

222. న్యాయాధిపతుల ఉద్యోగస్థానములందు తాత్కాలికముగా ఖాళీలువచ్చినయెడల చక్రవర్తి క్రొత్త వారిని నియమించువరకు గవర్నరు జనరలు తనస్వాతంత్ర్య వివేచనను ఉపయోగించి న్యాయాధిపతులను నియమించును. ఈ న్యాయాధిపతులను తొలగింపవలెనన్నచో ఇంగ్లాండులోని ప్రివికౌన్సిలు వారు చక్రవర్తికి సలహానొసంగిననే అటులచేయును. (ఇట్లు వీరి నియామకమునందును, జీతబత్తెములందు, తొలగించుటలోను

యొక్కయు వకీళ్ళయొక్కయు రుసుములు, అనుపయోగించ యాదస్తు లెక్కపుస్తకముల నమూనాలను నిర్ణయించుటకున అధికారముండును. హైకోర్టువారు చేయునిబంధనలన రాష్ట్రీయగవర్నరు ఆమోదించవలెను. (అనగా శాసనసభలకు మంత్రులకు ప్రసక్తియుండదు.)

225. ఏదావాలోనైనను ఏఫెడరలు రాష్ట్రీయ చట్టమైనను చెల్లదని నిర్ణయించవలసి వచ్చే మొదల ఆదావాను క్రిందికోర్టు కవిలెనుండి హైకోర్టు తమ కవిలెలోనికి చేర్చుకొని విచారించుట కధికారముకలదు.

226. గవర్నరు అనుమతితో శాసనసభలు నిర్ణయించినతప్ప హైకోర్టులకు రివిన్యూ ఆదాయమును గూర్చియు దానివసూలును గూర్చియు అధికారముండదు.

రాష్ట్రములందలి కోర్టులు విధించు ఉరిశిక్షలను క్షమించుటకు గవర్నరు జనరలు కధికారమివ్వబడినది. (ఇక్కడ దేశములందు మంత్రుల సలహాలపైన గవర్నరే క్షమించును.) హైకోర్టుయొక్క పరిపాలనకు అనగా ఉద్యోగుల యొక్కయు న్యాయాధిపతుల యొక్కయు జీతములు, అలవెన్సులు, ఉపకారవేతనములు, వీనికి గావలసినసొమ్ము దేశాదాయముపైన బద్ధతచేయబడినది. అనగా శాసనసభవారివోటుకు లోబడదు. హైకోర్టులో ఇంగ్లీషుభాషయే ఉపయోగింపబడును. హైకోర్టుతీర్పులపైన ఇదివరకువలెనే

ఇంగ్లాండులోని ప్రివీకవున్సిలుకు అప్పీళ్లు విచారించుహక్కుండును. ఏవ్యవహారమందైనను రాజ్యాంగచట్టమునుగాని ఆర్డర్ ఇన్ కవున్సిల్ నుగాని అన్వయించవలసిన అంశమున్నచో హైకోర్టుతీర్పుపైన కొత్తగా ఢిల్లీలో నిర్మింపబడిన ఫెడరలు కోర్టుకు అప్పీలువిచారించు అధికారముండును. ఆతీర్పుపైన ఇంగ్లాండులోని ప్రివీకవున్సిలుకు మరల అప్పీలుండును.

254. హైకోర్టుక్రిందనుండు జిల్లాజడ్జీలు, అసిస్టెంటు,అడిషనలు, జాయింటు, జిల్లాజడ్జీలు, వీరియొక్క నియామకము,ప్రమోషను, ట్రాన్సుఫరులు మంత్రులను ఆలోచించి గవర్నరు తనస్వబుద్ధినుపయోగించియే చేయును.

255 జిల్లాజడ్జీల క్రిందివిరగతి సివిలు న్యాయశాఖలోని ఉద్యోగులను (సబుజడ్జీలను జిల్లామునసబులను,) నియమించుటను గూర్చిన నిబంధనలను గవర్నరు పబ్లికు సర్వీసుకమీషను వారితోను హైకోర్టువారితోను ఆలోచించి చేయును. ఈఉద్యోగుల ప్రమోషనులు, ట్రాన్సుఫరులు, సెలవులు హైకోర్టువారి చేతిలోనుండును.

256 క్రిమినలు పరిపాలన విషయములో మేజస్ట్రేటులకు విచారణాధికారము నిచ్చుటకు తీసివేయుటకు ముందుగా జిల్లా మేజస్ట్రేటును ఆలోచించనిది మంత్రులు గవర్నరుకుపెట్టె శిఫారసు చేయరాదు.

ఫెడరలు శాసనసభలకు గాని రాష్ట్ర శాసనసభలకు గాని గవర్నరుజనరలు తనస్వతంత్ర వివేచన నుపయోగించి అధికార మిచ్చుచు బహిరంగ ప్రకటన చేయవచ్చును. అంతట ఆయా విషయములందు ఫెడరలుప్రభుత్వమును, రాష్ట్రీయప్రభుత్వము లును పరిపాలనాధికారము కూడా కలిగియుండును.

107. (1) ఫెడరలు శాసనసభలకు అధికారముగల విషయములందు అందుకువిరుద్ధముగా రాష్ట్రీయసభలు చేసిన చట్టనిబంధనలు చెల్లవు. (2) సమానాధికారముల జాబితాలోని విషయములను గూర్చి రాష్ట్ర శాసన సభ చేసిన చట్టము అంతకుముందే చేయబడిన ఫెడరలు శాసనముకుగాని ప్రస్తుతము అమలులోనున్న కేంద్ర శాసనమునకుగాని విరుద్ధముగా నున్నచో అది గవర్నరుజనరల్ చక్రవర్తి ఆమోదనకొరకు నిలుపుదల చేయబడి అట్టి ఆమోదము పొందియున్నచో ఆ రాష్ట్రశాసనమే అమలుజరుగును. అయితే గవర్నరుజనరలు అనుజ్ఞనుపొంది ఫెడరలు శాసనసభలు మరలశాసనము చేయ వచ్చును. (3) ఫెడరేషనులో చేరినసంస్థానము యొక్క శాసనము ఫెడరలు శాసనమునకు విరుద్ధముగా నున్నచో చెల్లదు.

---

ఫెడరలు శాసనాధికారములు

1. భారతదేశ స్వతంత్రసంస్థానములలో పని చేయుట కేర్పడినదళములును, రాష్ట్రీయపరిభుత్వములు నియమించిన

సాయుధములగు మిలిటరి పోలీసుదళములుగాక ఇండియా దేశపు సిబ్బందిలో చేర్చబడిన చక్రవర్తి యొక్క నావిక, సైనిక వైమానిక దళములును, చక్రవర్తి దళములు గాకపోయినను ఆదళములకు కలుపబడినట్టియు, లేదా ఆదళములతో కలిసి పనిచేయునట్టియు దళములును, సెంట్రల్ ఇంటెలిజన్సు బ్యూరో (కేంద్రఅపరాధపరిశోధకసమితి), రక్షణ, దేశాంతర వ్యవహారములకు, లేదా స్వదేశసంస్థానములతో వ్యవహార నిర్వహణమునకు సంబంధించిన రాజకీయకారణములనుబట్టి ముందుజాగ్రత్తకొరకు చేయబడు నిర్బంధములు.

2. నావిక, సైనిక, వైమానిక దళములపనులు, సంస్థానములందలి (కంటోన్మెంటు) దండుప్రదేశములందుగాక మిగతా దండుప్రదేశములందలి స్థానికస్వపరిపాలనము, ఆ ప్రదేశమునందును, బ్రిటీషు ఇండియాలోను, గృహనిర్మాణవసతులు, అట్టి ప్రదేశముల అవరణపరిమితుల నిర్ణయము (డిలిమిటేషను).

3. విదేశవ్యవహారములు ఇతర దేశములతో రాజీలు, ఒడంబడికలు జరిగించుట, 'ఎక్స్ట్రాడిషను'-నేరనిందితులను విదేశప్రభుత్వములకు వశము చేయుట, ఇండియాకు బయట చక్రవర్తికిగల ఇతరరాజ్యముల వారికి వశముచేయుట.

4. రాజకీయ మత విషయములు, ఐరోపావారి సమాధులదొడ్లు.

5. చెలామణి నాణెములు, అంకము స్వీకరించి తిరవలసిన నాణెములు (లీగల్ టెండర్) చెలామణి.

6. ఫెడరేషను యొక్క ఋణము.

7. తపాలా, తంతివ్యవహారములు, టెలిఫోను, వైర్లెను, బ్రాడ్కాస్టింగు, ఇతరవిధములగు సంసర్గమార్గములు, తపాలా సేవింగ్సుబ్యాంకి.

8. ఫెడరలు (పబ్లికుసర్వీసు) ఉద్యోగవర్గము, ఫెడరలు పబ్లికుసర్వీసుకమిషను.

9. ఫెడరలుపింఛనులు, అనగా ఫెడరలు రివిన్యూలో నుండి చెల్లింపవలసిన ఉపకార వేతనములు.

10. నావిక, సైనిక, వైమానిక దళములకొరకుగాక ఫెడరేషను కొరకు చక్రవర్తివశమైనట్టియు, లేదా చక్రవర్తికి స్వాధీనమైనట్టియు (వర్క్సు) పనులు, భూములు, కట్టడములు. అయితే ఒకరాష్ట్రమునందున్న ఆస్తి విషయములో ఫెడరలు శాసనము ఇతర విధముగా నిర్ణయించినతప్ప రాష్ట్రీయ శాసనములకు లోబడియుండును. ఫెడరేటెడు సంస్థానములో నున్న ఆస్తి విషయములో అసంస్థానముతో చేసుకొబడిన కౌలు ఒడంబడిక షరతులను బట్టి యుండును.

11. ఇంపీరియల్ లైబ్రరీ (గ్రంథాలయము), ఇండియా (మ్యూజియం) చిత్రవస్తు ప్రదర్శనశాల, ఇంపీరియల్ వార్ మ్యూజియం, విక్టోరియా మెమోరియల్, ఫెడరేష నువారి అధికారముక్రిందగాని, వారివలన పోషింపబడునట్టి గాని ఆమాదిరి ఇతర సంస్థలు.

12. పరిశోధనల కొరకు, వృత్తి విషయిక సాంకేతిక విద్యలందు శిక్షణకు కొరకు, ప్రత్యేకములగు విద్యల నభివృద్ధి చేయుకొరకుఏర్పడు ఫెడరల్ ప్రతిష్ఠాపనలు, ఏజెన్సీలు.

13. కాశీ హిందూ విశ్వవిద్యాలయము, అలీఘరు ముస్లిము విశ్వవిద్యాలయము.

14. హిందూదేశపు [ప్రైమాపీ] సర్వే, భూతత్వ వనస్పతి జంతుస్థితి సంబంధములగు గణితశోధన సర్వేలు, ఫెడరలు వాతావరణ సంస్థలు.

15. పురాతన చారిత్రకకట్టడములు, పురాతత్వ ప్రదేశములు, శిథిలములు.

16. జనాభాలెక్కలు.

17. భారతదేశము లోనికి వలస రానిచ్చుట, దేశము నుండి వెడలనంపుట, భారత దేశములోగాని ఇంగ్లాండులో గాని స్థిరవాసులుగాని బ్రిటీషువారలుగాని సంస్థానవారలు

గాని కాని వారియొక్క రాకపోకలను సంచారములను గూర్చిన కట్టుబాట్లు, దేశాంతర తీర్థయాత్రలు.

18. రేవులందు గమనాగమన సంసర్గ నిషేధము (క్వారంటైను), నావికా సంబంధమగు ఆసుపత్రులు, రేవుల క్వారంటైను సంబంధమగు ఆసుపత్రులు.

19. ఫెడరల్ గవర్నమెంటువారు నిర్ణయించునట్టి సుంకములవసూళ్ల సరిహద్దులు దాటిన ఎగుమతి దిగుమతులు.

20. ఫెడరల్ రైలుమార్గములు, చిన్నరైలుదారులు గాక తక్కిన రైళ్ళయందలి క్షేమము, అధికతమ, అల్పతమ కేవులరేట్లు, స్టేషను సర్వీసు "టర్మినలు చార్జీలు" (రవాణా రైలుసుములు), పెక్కురైళ్ళపైన పరస్పరముగానుండు రద్దీ సరకును, ప్రయాణికులను తీసికొనిపోవు రవాణాదారులుగా రైళ్ళపరిపాలకులకుగల బాధ్యత, క్షేమశ్రేయములు, సరకులను, ప్రయాణికులను రవాణా చేయుటలో చిన్నరైళ్ళ పరిపాలకులకుగల బాధ్యత.

21. సముద్రముపైనను, పాటు పోటులుగల దేశ మధ్యమునందలి జలమార్గములపైనను నడచు నౌకల వ్యవహారములు, నౌకాయానవ్యవహారములు, నావిక న్యాయ విచారణాధికారము.

22. పెద్దరేవులు, అనగా పెద్దరేవులుగా నిర్ణయించుట వాని హద్దుల నిర్ణయము, అచ్చటి పోర్టుఅధారిటీయొక్క నిర్మాణవ్యవస్థ, కట్టుబాట్లు.

23. చేపలుపట్టుట, (టెరిటోరియల్ వాటర్సు) తీర సమీపజలప్రదేశములందలి మత్స్యపరిశ్రమలు.

24. వాయువిమానములు, వాయుయానము, విమానాశ్రయములను ఏర్పరచుట, వాయుమార్గములందు రాక పోకలయొక్కయు, విమానాశ్రయములయొక్కయు నిర్మాణ వ్యవస్థ. కట్టుబాట్లు.

25. దీపస్తంభములు దీపపుటోడలు, వెలుతురుగంటలు [బీకను], నౌకలయొక్కయు వాయువిమానముల యొక్కయు క్షేమముకొరకు చేయు ఇతర ఏర్పాట్లు.

26. సముద్రమార్గములందును, వాయుమార్గములందును సరకులను, ప్రయాణికులను గొనిపోవుట.

27. కాపీరైటుహక్కులు, అపూర్వకల్పనాధికారములు, డిసైన్లు, వ్యాపారగురుతులు, సరకులగురుతులు.

28. చెక్కులు, హుండీలు, ప్రోనోట్లు, అటువంటి ఇతర పత్రములు.

29. ఆయుధములు, తుపాకి మొదలగునవి, మందు గుండుసామాను.

30. ప్రేలుడు పదార్థములు.

31. నల్లమందును పండించుట, తయారుచేయుట, ఎగుమతి కొరకు విక్రయించుట.

32. పెట్రోలు, శీఘ్రముగా నిప్పంటుకొనగల పదార్థములుగా ఫెడరల్ ప్రభుత్వమువారు నిర్ణయించిన ఇతర ద్రవపదార్థముల స్వాధీనము, నిలువ, రవాణాలు.

33. కంపెనీలు, అనగా వ్యాపార సంఘములు, బ్యాంకులు, భీమాకంపెనీలు, ద్రవ్యసంబంధములగు సంస్థల యొక్కయు వ్యాపారముచేయునట్టిగాని, చేయనట్టి ఒకటి కన్న హెచ్చురాష్ట్రములలో పనిచేయు కంపెనీలయొక్కయు, క్రమపరిపాలన (రెగ్యులేషను), క్రమపద్ధతి, ముగింపు. అయితే దీనిలో ఫెడరేషనులో చేరిన స్వదేశసంస్థానములయొక్క కంపెనీలును, సంస్థానములోనే వ్యాపారము చేయుకంపెనీలును, సహకార సంఘములును చేరవు.

34. ఫెడరల్ అధికారముక్రింద పరిశ్రమల నభివృద్ధి చేయుట శ్రేయస్కరమని ఫెడరలు శాసనము వలన నిర్ణయింపబడిన పారిశ్రామికాభివృద్ధి.

35. కార్మికసంబంధములకు కట్టుబాట్లు (Regulation of labour), గనులందు, నూనెగనుల ప్రదేశములందు కార్మికుల క్షేమము.

36. గనులు, నూనెగనుల ప్రదేశములు, ఖనిజసంపద యభివృద్ధిని గూర్చిన కట్టుబాటులలో ప్రజాశ్రేయముకొరకు ఫెడరల్ అధికారముక్రిందనుండునట్లు ఫెడరల్ శాసనము నిర్ణయించు కట్టుబాట్లు, అభివృద్ధి విషయములు.

37. ఫెడరేషనులో చేరిన స్వదేశ సంస్థానము నిర్వహించు భీమావ్యాపారము, దాని కట్టుబాట్లు గాక భీమా సంబంధమగు "లా" ఫెడరేషనులో చేరిన సంస్థానము నిర్వహించునట్టియు, రాష్ట్రీయ శాసనాధికారముల పట్టికలో గాని, ఉభయశాసనసభల అధికారపట్టికలోగాని చేర్చబడి రాష్ట్రము నిర్వహించునట్టియు భీమాగాక తక్కిన ప్రభుత్వ భీమావ్యవహారములు.

38. బ్యాంకింగు; అనగా ఫెడరేషనులో చేరిన సంస్థానముల యొక్కయు, సంస్థానముల అధికారము క్రింద నుండి సంస్థానములలోనే నడుపబడునట్టియు కంపెనీలవలనగాక ఇతర కంపెనీలద్వారా నడుపబడు బ్యాంకింగు వ్యవహారములు.

39. బ్రిటీషు ఇండియాలో నెచ్చటగానియుండు పోలీసు సిబ్బందిలోని ఉద్యోగులయొక్క అధికారములను, అధికార

మండలమును గవర్నరుల రాష్ట్రములందుగాని చీఫ్‌కమీషనరుల రాష్ట్రములందుగాని ఎచ్చటనైననుకూడ చలాయించునట్లు ఏర్పుచేయుట. అయితే ఆయారాష్ట్రముల అంగీకారములేనిదే అట్లుచలాయించునట్లు విధించుటకు వీలులేదు. రైల్వేపోలీసువారియొక్క అధికారమండలముకూడ ఒక చోటివారి కింకొక చోటనుగూడా నుండునట్లు ఏర్పు చేయుట.

40. ఈ చట్టముయొక్క విధులకును, దీనిక్రింద చేయబడు ప్రిపికవున్సిలు సభాయుతుడగు రాజాజ్ఞలకును లోబడి ఫెడరలు శాసనసభ కు జరుగు ఎన్నికలు.

41. ఫెడరల్ మంత్రుల జీతములు, కౌన్సిల్ ఆఫ్‌స్టేటు అధ్యక్షునియొక్కయు, ఉపాధ్యక్షునియొక్కయు జీతములు, అసెంబ్లీస్పీకరుయొక్కయు, డిప్యూటీస్పీకరుయొక్కయు జీతములు, ఫెడరలు శాసనసభలసభ్యులయొక్క జీతములు, వేతనములు, బత్తెములు, వారి విశేషహక్కులు.

ఈచట్టముయొక్క 2-వ భాగములో చెప్పబడినంతవరకు శాసన సభలయొక్క ఉపసంఘములయెదుట సాక్ష్యమిచ్చుటకు, దస్తావేజులు హాజరు పరుచుటకు నిరాకరించు వారిని శిక్షించుట.

42. ఈ జాబితాలో చెప్పబడిన విషయములనుగూర్చి చేయబడు శాసనముల నుల్లంఘించు నేరములు.

43. ఈ జాబితాలోని విషయముల కొరకు చేయబడు విచారణలు, స్థితిగతి లెక్కలు (Statistics).

44. సుంకములు, ఎగుమతిపన్నులు.

45. పొగాకుపైనను, భారతదేశములో తయారుచేయబడు సరకులపైనగాక మిగతావానిపైనను విధింపబడు అబ్కారీ పన్ను. [జనులు త్రాగు కల్లు, సారా వగయిరా మద్యములు, నల్లమందు, గంజాయి యితర నిషావస్తువులు, మత్తుపదార్థములు, ఇతర మందులు, మద్యపదార్థములు గాక పోయినను పైన చెప్పబడిన దినుసులు కలిసిన వైద్య సంబంధములును, సౌందర్య వర్ధకములు నగు పదార్థములు గాక.]

46. కంపెనీల పన్ను.

47. ఉప్పు.

48. ప్రభుత్వ లాటరీలు.

49. పౌరసత్వ సిద్ధి. Naturalisation

50. భారత దేశములో నొక రాష్ట్రమునుండి యింకొక రాష్ట్రములోనికి వలస.

51. తూనికల ప్రమాణము నిర్ణయించుట.

52. రాంచీలోని మనోవ్యాధుల ఆసుపత్రి.

53. ఈజాబితాలో చెప్పబడిన విషయములకు సంబంధించినంత వరకును, ఈచట్టములో 9-వ భాగమున స్పష్టము

గా చెప్పబడి నంతవరకును ఫెడరలు కోర్టుయొక్క విచారణాధి కారము, దాని అప్పీలువిచారణాధి కారమును, దానికి (సప్లిమెంటరీ) విశిష్టాధికారముల నిచ్చుటయు ఇతర అన్ని కోర్టులయొక్క న్యాయవిచారణాధికారము.

54. వ్యవసాయ ఆదాయములుగాక ఇతర ఆదాయ ముపైన విధింపబడు పన్నులు.

55. సాగుభూములుగాక ఇతర ఆస్తియొక్క మూల ధనపు విలువపైనను, వ్యక్తులపైనను, కంపెనీలపైనను కంపె నీల మూలధనముపైనను విధింపబడు పన్నులు.

వ్యవసాయ
56. సాగుభూములుగాక మిగతా ఆస్తి సంక్రమణ ములపైన పన్ను.

57. హుండీలు, చెక్కులు, ప్రోనోట్లు, లేడింగుబిల్లులు, పరపతి ఉత్తరములు, భీమాపట్టాలు, ముక్త్యారునామాలు, రశీదులపైన స్టాంపుడ్యూటి.

58. రైళ్ళపైన, వాయుమార్గములపైన రవాణాచేయ బడు సరకులు, ప్రయాణికుల విషయములో రవాణా రుసు ములు, రైలుకేవులు, రవాణాకేవులుపైన పన్నులు.

59. ఈ జాబితాలోని ఏవిషయమునకైన సంబంధిం చిన (Fees) రుసుములు. అయితే ఏకోర్టువారుగానిగైకొను రుసుములిందు చేరవు.

## రాష్ట్రీయ శాసనాధికారములు

1. ప్రజల శాంతిభద్రత(పబ్లికుఆర్డరు). అయితే సివిలు అధికారమునకు సహాయముగా చక్రవర్తి యొక్క నావిక, సైనిక, వైమానికదళముల నుపయోగించుటలో నిది చేరదు. న్యాయపరిపాలన ఫెడరలు కోర్టుతప్ప తక్కిన అన్నికోర్టుల యొక్క నిర్మాణవ్యవస్థ, ఏర్పాటు, అందుగైకొనబడు రుసుములు, ప్రజలశాంతి భద్రతలయొక్క ముందుజాగ్రత్త కొరకు నిర్బంధములు చేయుట, అట్లు నిర్బంధింపబడినవారు.

2. ఫెడరలుకోర్టుతప్ప తక్కిన అన్నికోర్టులయొక్క విచారణాధికారము, ఈజాబితాలో చెప్పబడిన విషయములను గూర్చి వారికిగల అధికారము, రెంటు, రివిన్యూ, శిస్తువసూళ్లు, కోర్టులలోని వ్యవహారపద్ధతి.

3. పోలీసు (రైల్వే, గ్రామ పోలీసుసహా).

4. కారాగారములు, సంస్కార కారాగారములు, బోర్ట్సుల్ ప్రతిష్టాపనములు, అటువంటి ఇతరసంస్థలు, అందులో నుంచబడు నిర్బంధితులు, కారాగారములను ఇతరసంస్థలను ఉపయోగించు విషయములో ఇతర రాష్ట్రములతోడి యేర్పాటులు.

5. రాష్ట్రప్రభుత్వముయొక్క ఋణము.

6. రాష్ట్రీయ [పబ్లికుసర్వీస్] ఉద్యోగవర్గములు, రాష్ట్రీయ పబ్లికు సర్వీసు కమీషన్లు.

7. రాష్ట్రీయ ఉపకారవేతనములు, అనగా రాష్ట్రములు చెల్లించవలసినట్టి, లేదా రాష్ట్రాదాయములోనుండి చెల్లవలసినట్టి పింఛనులు.

8. నిర్మాణపునులు (Works), రాష్ట్రము యొక్క ఉపయోగముకొరకు చరిత్ర ఉత్తరవశములో నుండు భూములు, కట్టడములు.

9. నిర్బంధభూసంపాదనము(Land Acquisition).

10. గ్రంథాలయములు, చిత్రవస్తు ప్రదర్శనశాలలు, రాష్ట్రముయొక్క అధికారముక్రిందనున్నట్టిగాని, రాష్ట్రముచే పోషింపబడునట్టిగాని అట్టి ఇతరసంస్థలు.

11. ఈ చట్టము క్రిందను, దీని క్రింద జారీచేయబడి సభాయుతుడగు రాజాజ్ఞలక్రిందను రాష్ట్రీయ శాసనసభలకు జరుగు ఎన్నికలు.

12. రాష్ట్రీయ మంత్రుల జీతములు, శాసనసభాధ్యక్షులయొక్కయు, ఉపాధ్యక్షుల యొక్కయు జీతములు, శాసన సభ్యులయొక్క జీతములు, వేతనములు, బత్తెములు, విశేష హక్కులు, ఈ చట్టము యొక్క 8-వ భాగములో స్పష్టముగా నిర్ణయింపబడినంతవరకు రాష్ట్ర శాసనసభయొక్క ఉపసంఘములయెదుట సాక్ష్యమిచ్చుటకు దస్తావేజులు హాజరు పరచుటకు నిరాకరించువారిని శిక్షించుట.

13. స్థానిక పరిపాలన: అనగా మునిసిపలుసంఘముల యొక్కయు, ఇంప్రూవుమెంటు ట్రస్టులు, జిల్లాబోర్డులు, మైనింగు సెటిల్మెంటు అధికారుల యొక్కయు, మఱియు స్థానికస్వపరిపాలన కొరకుగాని, గ్రామపరిపాలన కొరకుగాని ఏర్పడిన ఇతర స్థానిక అధికార సంస్థలయొక్క నిర్మాణము, అధికారము.

14. ప్రజారోగ్యము, పారిశుధ్యము, ఆసుపత్రులు, ఔషధశాలలు (డిస్పెన్సరీలు), జనన మరణముల నమోదు (రిజిస్ట్రేషను).

15. దేశాంతర యాత్రలు గాక మిగతాతీర్థయాత్రలు.

16. శవములను పూడ్చుట, స్మశానములు.

17. విద్య.

18. సంసర్గమార్గములు: అనగారోడ్డులు, వారధులు (బ్రిడ్జిలు), బల్లకట్టులు, ఒకటవజాబితాలో నుదహరింపబడని ఇతర రాకపోకలమార్గములు, ఒకటవజాబితాలోని నియమములకు లోబడి చిన్నరైళ్ళ విషయము, మునిసిపలు ట్రాము దారులు, త్రాడుదారులు, రాష్ట్రమధ్యమున నుండునీటిదారులును, 3 వ జాబితాలోని నియమములకు లోబడి ఆ నీటిదారులమీదనుండు రాకపోకలు,ఎగుమతి దిగుమతులు,రేవులు, ఒకటవ జాబితాలోని నియమములకు లోబడి పెద్దరేవులు, యంత్రబలముచే నడుచునట్టివి గాక తక్కిన శకటములు.

19. సీటివసతి: అనగా సీటి సరఫరా, పల్లపుసాగు (ఇర్రిగేషను) కాలువలు, మురుగు, చెరువు, కాలువకట్టలు, ఏటినిలువ, జలశక్తి.

20. వ్యవసాయము, వ్యవసాయక విద్య, పరిశోధన, చీడల నివారణ, మొక్కల తెగుళ్ళ నివారణము, పశువులు వగైరా మందలయొక్క అభివృద్ధి, పశురోగ నివారణ, పశువైద్య అభ్యసనము, [Practice] పాడుక, బందెలదొడ్లు; పశువుల అక్రమ ప్రవేశమును నివారించుట.

21. భూములు: అనగా భూమి హక్కులు, రైతు హక్కులు, భూకామందు రైతులమధ్య సంబంధములు, శిస్తు వసూలు, వ్యవసాయక భూమియొక్క వినిమయము, అన్యాక్రాంతములు, హక్కుసంక్రమణము, భూమియొక్క అభివృద్ధి, వ్యవసాయిక ఋణములు, వలసనెలకొనుట, కోర్టుఆఫ్ వార్డ్సు, జప్తుచేయబడిన, లేదా తాకట్టుపెట్టబడిన ఎస్టేటులు, పాతులు, నిధినిక్షేపప్రాప్తి.

22. అడవులు.

23. గనులయొక్కయు, నూనెగనులప్రదేశముల యొక్కయు కట్టుబాటులు, ఒకటవజాబితాలోని నియమముల ప్రకారము ఫెడరలుఅధికారమునకు లోబడి ఖనిజసంపదయొక్క అభివృద్ధి.

24. చేపలమడుగులు.

25. అడవిమృగములయొక్కయు, పక్షులయొక్కయు సంరక్షణ.

26. గ్యాస్, గ్యాసు కర్మాగారములు.

27. వర్తకము, రాష్ట్రీయ వాణిజ్యము, మార్కెట్లు (బజారులు), సంతలు, వడ్డీవ్యాపారము, వడ్డీవ్యాపారులు.

28. పూటకూటిండ్లు, పూటకూటిండ్లవారు.

29. వస్తూత్పత్తి, వస్తువిభజన, వస్తువులసరఫరాలు, కేంద్ర అధికారముక్రింద అభివృద్ధిచేయబడునట్లు ఒకటవ జాబితాలో నిర్ణయింపబడిన కొన్ని పరిశ్రమలుగాక ఇతర పరిశ్రమల యభివృద్ధి.

30. ఆహార పదార్థములందును, ఇతరవస్తువులందును కల్తీ, తూనికలు, కొలపాత్రలు.

31, విషపానీయములు, మత్తుమందులు, అనగా విషావస్తువులు, నల్లమందు మొదలైన మత్తుపదార్థములయొక్క ఉత్పత్తి స్వాధీనము, రవాణా, క్రయవిక్రయములు. [అయితేనల్లమందువిషయములో ఒకటవజాబితాలో చెప్పబడిన నియమములకును, విషములు, అపాయకరములగు ఇతరమందుల విషయములో 3–వ జాబితాలోని నియమములకును లోబడి.]

32. బీదల దారిద్ర్యనివారణ, నిర్వ్యాపార విషయము.

33. ఒకటవజాబితాలో చెప్పబడిన [కంపెనీ] సంఘములుగాక ఇతరసంఘముల నిర్మాణము, క్రమవిధానము (రెగ్యులేషను), ముగింపు, సంఘవ్యవస్థ లేని వ్యాపారసాహిత్య శాస్త్రవైజ్ఞానిక గతిసంబంధ ఇతరవిధసంఘములు, మండలములు, సహకారసంస్థలు.

34. ధర్మములు, ధర్మసంస్థలు, ధర్మాదాయములు, దేవాదాయములు, మతవిషయకధర్మములు.

35. నాటకశాలలు, నాటకప్రదర్శనములు, సినిమాలు అయితే సినిమాఫిల్ముల ప్రదర్శనమున కనుమతినిచ్చుట దీనిలో చేరదు.

36. పందెములొడ్డుట, జూదములు.

37 ఈ జాబితాలోని ఏ విషయమునుగూర్చినట్టి గాని నేరములు.

38 ఈజాబితాలోని ఏ విషయమునుగూర్చినట్టి గాని విచారణలు, స్థితిగతి లెక్కలు.

39. భూమిపన్ను, రివిన్యూ, రివిన్యూపన్ను నిర్ణయము, పనూలు, ల్యాండురికార్డులు, రివిన్యూ వ్యవహారముల నిమిత్తము చేయబడు సర్వే, రికార్డు ఆప్ రైట్సు (హక్కుల పహాదు), రివిన్యూయొక్క అన్యాక్రాంతములు.

40. రాష్ట్రములో తయారుచేయబడు ఈదిగువ వస్తువులపైన ఆబ్కారీపన్ను విధించుట, ఇండియాలో ఇతర చోట్ల చేయబడునట్టి అదేమాదిరి వస్తువులపైన ఆయాచోట్ల విధింపబడు ఆబ్కారీ పన్నులతో సమానమగునట్టి పన్ను రేట్లు గాని, తక్కువ రేట్లుగాని నిర్ణయించుట: (1) మద్యసారము గల పానీయద్రవములు, (2) నల్లమందు, గంజాయి, ఇతరమత్తు ద్రవ్యములు, నిషావస్తువులు, నిషాచేయుని మందులు, (3) మద్యసారము, నిషాపదార్థములు కలియు మందులు, సౌందర్యవర్ధక పదార్థములు.

41. వ్యవసాయ ఆదాయములపైన పన్నులు.

42. భూములపైన, కట్టడములపైన, పొయ్యిలపైన, కిటికీలపైన పన్నులు.

43. వ్యవసాయ సాగు భూములయొక్క హక్కు సంక్రమణలపైన పన్నులు.

44. ఖనిజసంపదయొక్క అభివృద్ధిని గూర్చి ఫెడరలు శాసన నియమములకు లోబడి ఖనిజముల హక్కులపైన పన్నులు.

45. తలకింతయని విధింపబడు పన్నులు.

46. వృత్తులపైన, వ్యాపారములపైన, ఉపాధులపైన, సేవలపైన పన్నులు.

47. జంతువులపైన, పడవలపైన పన్నులు.

48. వస్తువిక్రయముల పైన వ్యాపారప్రకటన (అడ్వర్టయిజ్‌మెంటు) పయిన పన్నులు.

49. ఒక స్థానిక ప్రదేశమున ఖర్చుకొరకు, ఉపయోగము కొరకు, విక్రయముకొరకు చేయబడు సరకుల దిగుమతుల పైన విధింపబడు (సెస్సులు) చిల్లర పన్నులు.

50. భోగములపైన పన్ను, వినోదములపైన, వేడుకల పైన, పందెములపైన, జూదములపైన పన్నులు సహా.

51. ఒకటవజాబితాలో చెప్పబడిన దస్తావేజుల స్టాంపు డ్యూటీగాక ఇతర దస్తావేజులపైన స్టాంపుడ్యూటీ.

52. రాష్ట్రములోపల నీటిదారులపైన రవాణాయగు సరకులు, ప్రయాణీకుల విషయములో విధింపబడువన్ను.

53. (టోలుగేటు) ఘాటీపన్నులు.

54. కోర్టులు కైకొను రుసుములుగాక ఈజాబితాలో చెప్పబడిన ఇతర విషయములకు సంబంధించిన రుసుములు.

7

## ఫెడరల్ రాష్ట్రీయ సమానాధికారములు

1. క్రిమినలులా:- ఈచట్టము శాసింపబడునాటికి ఇండియన్ పీనలుకోడ్డులో చేరిన అన్ని విషయములు; అయితే, ఒకటిరెండుజాబితాలలోని విషయములను గూర్చిన నేరములును, చక్రవర్తి నావిక, సైనిక, వైమానిక బలములను సివిలు అధికారముయొక్క సహాయము కొరకు వినియోగించుట, ఇందుచేరదు.

2. క్రిమినలు వ్యవహారధర్మము (ప్రొసీజరు) ఈచట్టము శాసింపబడునాటికి క్రిమినలు ప్రొసీజరు కోడ్డులో చేరిన, అన్ని విషయములు.

3. ఖైదీలను, నిందితులను ఒకరాష్ట్రములోనుండి ఇంకొక రాష్ట్రమునకు పంపుట.

4. సివిలు వ్యవహార ధర్మము, కాలదోషముల చట్టములోను, సివిలు ప్రొసీజరుకోడ్డును ఈచట్టము శాసింపబడిన తేదీనాటికి చేరిన విషయములు, పన్నుల మొత్తములు, ఇతర పబ్లికు డిమాండు మొత్తములు (సర్కారుకిస్తీలు), రివిన్యూ కిస్తుబకాయిలు, అట్టిబకాయిలుగా రాష్ట్రముబయట వసూలు కాదగిన మొత్తములను రాష్ట్రములో వసూలుపరచుట.

5. సాక్ష్యములు, ప్రమాణములు, దేశములోని ధర్మ

శాస్త్రవిధులు, పబ్లికుచర్యలు, కవిలెలు, రికార్డులు, న్యాయస్థానచర్యలు ప్రమాణభూతము చేయుట.

6. వివాహములు, వివాహవిచ్ఛేదనములు, శిశువులు మైనరులు, దత్తతలు.

7. మరణశాసనములు, మరణశాసనము వ్రాయకుండాచనిపోయినవారి ఆస్తి వ్యవహారములు, వ్యవసాయ భూములుగాక తక్కిన ఆస్తిసంక్రమణములు.

8. వ్యవసాయ భూమిగాక ఇతరభూముల హక్కుల మార్పులు, దస్తావేజులయొక్కయు, పత్రములయొక్కయు నమోదులు, రిజిస్ట్రేషను.

9. ట్రస్టులు, ట్రస్టీలు, ధర్మకర్తలు దానధర్మ విశ్వాసములు, ధర్మకార్యవిశ్వాసులు.

10. కంట్రాక్టులు (ఒడంబడికలు), భాగస్వామ్యము, ఏజన్సీ (ప్రతినిధ్యము), రవాణా ఒడంబడికలు, ఇతర విధములగు స్పెషల్ కంట్రాక్టులు. అయితే వ్యవసాయిక భూములను గూర్చిన ఒడంబడికలిందుచేరవు.

11. పంచాయతీ మధ్యస్థతీర్మానములు (ఆర్బిట్రేషను)

12. దివాలా, ఋణతీర్మానాకర్త, అడ్మినిస్ట్రేటర్ జనరల్, అఫిషియల్ ట్రస్టీలు.

13. న్యాయస్థాన సంబంధమగు స్టాంపులద్వారావసూలగు రుసుములు, పన్నులు, స్టాంపుడ్యూటి రేట్లునుగాక ఇతర స్టాంపుడ్యూటీ వ్యవహారములు.

14. ఒకటి, రెండు జాబితాలలో చెప్పబడిన విషయములనుగూర్చిన శాసనములలో నిరోధింపబడినట్టివి తప్ప తక్కిన విధములగు దావాపరిహారములు పొందతగిన అన్యాయాపరాధము.

15. ఈజాబితాలో చెప్పబడిన విషయములకు సంబంధించిన ఫెడరల్ కోర్టుయొక్క అధికారములు తప్ప తక్కిన అన్నికోర్టులయొక్క అధికారమండలము. అధికారములు.

16. న్యాయసంబంధములు, వైద్యసంబంధములువగు వృత్తులు ఇతరవృత్తులు.

17. వార్తాపత్రికలు, పుస్తకములు ముద్రాక్షరశాలలు.

18. పిచ్చివారిని మనోబలములేని అమాయికులను ఉంచుటకును, వారికి చికిత్సచేయు స్థలములును ఉన్మాదమును మనోబలము లేమిని గూర్చి వ్యవహారములు.

19. విషములు; అపాయకరమగుమందులు.

20. యంత్రబలముచే నడుపబడు శకటములు.

21. బాయిలర్లు (బానలు, కాగులు)

22. జీవహింసనివారణ.

23. ఐరోపాజాతి దేశదిమ్మరులు, నేరములు చేయుగు జాతులు.

24. ఈ జాబితాలో నీభాగమునకు సంబంధించిన విషయములనుగూర్చిన విచారణలు; స్థితిగతి లెక్కలు.

25. కోర్టువారు పుచ్చుకొను రుసుములుగాక ఈజాబితాలో నీభాగమునకు సంబంధించిన విషయములనుగూర్చిన రుసుములు.

26. ఫ్యాక్టరీలు (కర్మాగారములు)

27. కార్మిక శ్రేయము, పావిడెంటు ఫండ్లు; యజమానుల బాధ్యత, పనివాళ్ల నష్టపరిహారములు; ఆరోగ్యభీమా; అశక్తులకు ఉపకారవేతనములు; వృద్ధుల కుపకార వేతనములు.

28. నిర్వ్యాపార భీమా.

29. వ్యాపారసమితులు (ట్రేడ్ యూనియన్లు).

30. మనుష్యులకు, జంతువులకు, చెట్లకుసంబంధించిన చీడలు, అంటువ్యాధులు, పోకుడు (అమ్మవారు) రోగములు ఒకరాష్ట్రమునుండి మరొకరాష్ట్రమునకు వ్యాపించకుండ నివారించుట.

31. విద్యుచ్ఛక్తి.

32. నౌకావిషయములు, దేశమధ్యమందలి జలమార్గములపైన యంత్రశక్తిచే నడచుటు ఓడలకు సంబంధించిన నౌకాయానము, దానికి సంబంధించిన (లా) న్యాయము.

33. సినీమాఫిల్ములకు అనుమతినిచ్చుట.

34. ఫెడరల్ అధికారముక్రింద జాగ్రత్తకొరకు నిర్బంధింపబడిన వారి విషయము.

35. ఈజాబితాలో నీభాగమునకు సంబంధించిన విషయములనుగూర్చిన విచారణలు, స్థితిగతిలెక్కలు.

36. కోర్టువారు పుచ్చుకొనుచుసుములు గాక ఈజాబితాలో నీభాగమునకు సంబంధించిన రుసుములు.

## రాజనిర్దేశపత్రము

## (Instrument of Instructions)

రాజ్యాంగచట్టమును బట్టి గవర్నరు తన స్వతంత్రవివేచనను స్వబుద్ధిని ఉపయోగించి చలాయించవలసిన అధికారముల విషయములో లేదు గవర్నరుజనరలుయొక్క అదుపు ఆజ్ఞలక్రిందనుండి గవర్నరు జనరలప్పుడప్పుడొసగు ఉత్తర్వుసూచనలను బట్టి నడచుకొనవలెనని 54 వ శెక్షను విధించుచున్నది. గవర్నరు జనరలు గవర్నరులకిట్టి సూచన

లను చేయుటలో 53 వ శెక్షను ప్రకారము గవర్నరులకు ఆంగ్ల రాజు జారీచేయు రాజనిర్దేశపత్రములోని సూచనలకు విరుద్ధముగానుండరాదు. ఈ రాజనిర్దేశపత్రి మనునది రాజు స్వతంత్రముగా పంపు అజ్ఞాపత్రము కాదు. బ్రిటిషు పార్లమెంటు మంత్రులు భారతదేశ పరిపాలన విషయములో గవర్నరులు నడచుకొనవలసిన విధానములను ముందుగా నిర్ణయించి రాజనిర్దేశ పత్రముయొక్క చిత్తుప్రతినొకదానిని తయారుచేసి దానిని పార్లమెంటు సభవారి యెదుట పెట్టుదురు. ఆసభవారు ఆ మతలబు ప్రకారము రాజనిర్దేశపత్రమును జారీచేయవలసినదని రాజునుకోరుచు నొకతీర్మానమును చేయుదురు. అంతట ఆంగ్లచక్రవర్తి పేరట నది జారీచేయబడును. గవర్నరుజనరలుకు కూడ ఇట్టినిర్దేశపత్రమొకటి పంపబడును. సాధారణముగా ఈ సూచనల ప్రకారమే గవర్నరులు, గవర్నరుజనరలు వర్తింతురు. అప్రకారము వారు నడువలేదని మాత్రము ఎవరును వారిని ప్రశ్నించుటకు వీలులేదు. అనగా భారతీయులేదైన హక్కులనడిగినచో ఆపత్రములో లేదని సాకుచెప్పుదురు. వారికిష్టమైనప్పు డిచ్చవచ్చినట్లు వర్తింతురు.

రాజనిర్దేశపత్రములోని నిబంధనలు.

రాష్ట్రముయొక్క పరిపాలన కార్యనిర్వాహణమును గూర్చిన విషయములు:

7. "మా గవర్నరు ఈ క్రిందివిధముగా మంత్రులను నియమించుటకు ప్రయత్నింపవలెను. శాసనసభలో దృఢ

మెజారిటీ (స్థిరమైన అధికసంఖ్యాక పక్షబలము) కలిగియుండు వని తనబుద్ధికి తోచిన రాజకీయ నాయకునితో ఆలోచించి శాసనసభవారి యొక్క విశ్వాసమునకు సమిష్టిగా పాత్రులు కాగలట్టివారినే మంత్రులుగా నియమింప ప్రయత్నింపవలెను. సాధ్యమైనంతవరకు ముఖ్యమైన అల్పసంఖ్యాక జనసంఘము లకుగూడ ఈమంత్రి సభలో ప్రాతినిధ్యముండునట్లు చూడ వలెను. ఈసందర్భములో మంత్రులలో సమిష్టిబాధ్యత అనగా తామొక్కొక్కరు నెరవేర్చు వ్యవహారములకెల్ల అందరుకూడా జవాబుదారీవహింపవలెనను భావమునుపెంపొం దింపవలెనను సంగతిని గవర్నరు సదా మనస్సునందుంచు కొనవలెను.

8. "రాజ్యాంగచట్టము ప్రకారము తనస్వతంత్ర విచే చన నుపయోగించవలెనని విధింపబడిన విషయములందు తప్ప రాష్ట్రముయొక్క పరిపాలన (కార్యనిర్వాహక) అధి కారములో చేరిన అన్ని విషయములందును తన అధికారము లను చలాయించుటలో గవర్నరు మంత్రులసలహా ప్రకా రమే నడువవలెను. అయితే అట్లునడచుట ఈచట్టమువలన తనకివ్వబడిన ప్రత్యేక బాధ్యతలకు సంబంధించిన విశేషాధి కారములను చలాయించుటకుగాని లేదా ఈచట్టము క్రింద తనస్వబుద్ధి నుపయోగించునట్లు విధింపబడిన విషయములలో తన అధికారమును చలాయించుటకుగాని విరుద్ధముగ నుండు అని అభిప్రాయ పడినచో వారిసలహా త్రోసిపుచ్చి తాన

చెప్పబడిన తనబాధ్యతలను విశేషాధికారములను సక్రమము గా నిర్వహించుట కేవిధముగా నడచుట యుక్తమని తన స్వబుద్ధికి తోచునో ఆవిధముగానే నడువవచ్చును. అయితే న్యాయముగా మంత్రులే బాధ్యతవహింప వలసిన విషయము లందు వారు తమబాధ్యతను తప్పించుకొని గవర్నరుయొక్క ప్రత్యేక బాధ్యతలపైనే తాముకూడా ఆధారపడకుండులాగున మాగవర్నరు అప్రమత్తుడై యుండవలెను.

9." శాసనసభలందు ప్రత్యేక ప్రాతినిధ్యమొసగబడిన జాతి మత కులములకు చెందిన అల్పసంఖ్యాక జనసంఘము లును కేవలము అల్పసంఖ్యాకులగుటవలన గాని నాగరికత వలనగాని విద్యాసౌకర్యములు గాని ఐహికాభివృద్ధికి తగిన అవకాశములుగాని లేనికారణమునను మరియితర కారణము వలనగాని తమఅభివృద్ధికి శాసనసభలందు తమసమష్టి రాజ కీయ ప్రయత్నము పైననే ఆధారపడలేనందున తనరక్షణలో నుంచబడిన జనసంఘములును సామాన్యముగా ఎట్టి ఉపేక్ష కును జులుమునకును లోనుగాకుండగను అట్టిభయముకూడ వారికి లేకుండగను జూచునట్లుగా అల్పసంఖ్యాకుల న్యాయ మైన హక్కులను కాపాడుటకు తనకుగల ప్రత్యేక బాధ్య తను గవర్నరు అన్వయించుకొనవలెను. అయితే ఒక విష యమై కొందరు అధికసంఖ్యాక పక్షమువారితో ఏకీభవింప వక భిన్నాభిప్రాయులై నంతమాత్రమున వారు తన సంర క్షణ కర్హులని గవర్నరూహింపరాదు. మరియు అప్ర

బాధ్యతనుబట్టి మూకొలువులో ఆయాజనసంఘములజనసం ఖ్యను బట్టి దామాషాగా ఉద్యోగములుండునట్లు చూచు టకూడ తనకువిధియై యున్నదని మాగవర్నరు అర్థము చేసి కొనవలెను. ఈనిర్దేశపత్రిమును మేముజారీచేయునప్పటి ఏ రాష్ట్రములోనైనను ఉద్యోగముల విషయమై అంగీకృతమైన పద్ధతి ఏదైనా అమలులోనున్నచో ఆయాజనసంఘముల లాభముకొరకు అపద్ధతిని మార్చుట యవసరమని అతనికి పూర్తి నమ్మకము కలిగినతప్ప అప్రికారమే నడువవలెను.

10. "ఈచట్టమునుబట్టిగాని చట్టమువలనగాని పబ్లికు సర్వీసు ప్రభుత్వ ఉద్యోగులకివ్వబడిన హక్కులను వారి యొక్క న్యాయమగు హక్కులను సంరక్షించుటకు గవ ర్నరుకివ్వబడిన ప్రత్యేక బాధ్యత విషయములో మాగవర్నరు ఈచట్టము వలనగాని దీనినిబట్టిగాని అమలులోనుండు మరి యొకచట్టమునుబట్టిగాని వారికి నిర్ణయింపబడిన హక్కులు సంరక్షించుట మాత్రిమేగాక వారికి న్యాయకరమని తన బుద్ధికి తోచు ఏచర్యవలనగాని వారికి నష్టములేకుండ కాపా డవలెను.

11. "ఇంగ్లీషువారిపట్ల విచక్షణచూపి వారికి బాధకర ముగను నష్టకరముగను శాసనములు చేయకుండ చట్టములోని 5 వ భాగముయొక్క 3 వ ప్రికరణమున శాసన నిర్మాణవిష యమున చెప్పబడిన నిబంధనలయొక్క ఉద్దేశములను పరి

పాలన వ్యవహారమండలమునందు సక్రమముగా నెరవేర్చుటకుగాను గవర్నరుకివ్వబడిన ప్రత్యేకబాధ్యతనుబట్టి ఏవిషయమును గూర్చియైనను మంత్రులు తనకిచ్చు సలహా ప్రత్యక్షముగా చట్టములోని ఏవిధికిని విరుద్ధముగ నుండనప్పటికి గూడ పైనచెప్పబడిన ప్రకరణము ఎందుకేర్పడినదో ఆఉద్దేశములకు భంగకరముగ పరిణమింపగలదని గవర్నరు స్వబుద్ధితోచినచో అతడు విధిగా మంత్రిసలహాను త్రోసిపుచ్చి తీరవలెననియే ఆప్రత్యేకబాధ్యత యొక్క అర్థమని యెఱుగవలెను.

12. "ఏస్వదేశసంస్థానముయొక్క ఆర్థికజీవనమునకైన భంగకరముగనుండునట్టి చర్యయు లేదా ఒకఒడంబడికనుబట్టి లేక దాని శాసనమునుబట్టి లేక వాడుకనుబట్టి సమ్మతినిబట్టిగాని ఇంకేవిధముగకాని ఒకసంస్థానమున కేర్పడియున్న హక్కులకు భంగకరముగనుండునట్టి చర్యయు గైకొనబడకుండునట్లు స్వదేశసంస్థానముల న్యాయమైన హక్కులు కాపాడుటకివ్వబడిన ప్రత్యేకబాధ్యతను అన్వయించుకోవలెను. అట్టి హక్కులు సంస్థానమునకు కలదా లేదాయను విషయమును నిర్ణయించుట అవసరమైనచో గవర్నరు జనరలునకు తెలుపవలెను.

12. (ఎ) "బీరారులో హైదరాబాదు సంస్థానము యొక్క ఆర్థిక వాణిజ్య హక్కులు సంరక్షించవలెను.

13. "రాష్ట్రీయ పరిపాలనయొక్క వ్యవహారాచరణమునకు సంబంధించిన నిబంధనలను చేయుటలో ఆవ్యవహారాచరణము చక్కగా జరుగుటకుగాను ఇతర మంత్రులు తాముచేయు ప్రతివ్యవహారమునందును ద్రవ్యవ్యవహారమునకు సంబంధించగల విషయములను 'ఫైనాన్సు' (ద్రవ్యవ్యవహార) కోశమంత్రితో ఆలోచించునట్లు గవర్నరు కట్టడి చేయవలెను. మరియు ఒకందుకొరకివ్వబడిన గ్రాంటులో కొంత సొమ్ము ఇంకొకదానిక్రింద ఖర్చుపెట్టుట వ్యవహారము (Reappropriation), ద్రవ్యవ్యవహారశాఖ (ఫైనాన్సు డిపార్టుమెంటు) తప్ప ఏఇతర శాఖయు చేయకూడదు. మరియు (ఫైనాన్సు) కోశమంత్రి ఆమోదించు నిబంధనల ప్రకారము తప్ప ఇతరవిధముగా చేయుబడరాదు. ఏవిషయమందైన కోశమంత్రి భిన్నాభిప్రాయుడైనచో ఆవిషయము మంత్రులసభవారి తీర్మానమునకు పెట్టబడవలెను. అల్పసంఖ్యాకులు చేసికొను మనవులను జాగ్రత్తగా గమనింపబడులాగునకూడ గవర్నరు నిబంధనలందు కట్టుదిట్టములు చేయవలెను.

14. "మాకొలువునందుఎవరినైనను ఉద్యోగమునందు నియమించుటకు మారాజ్యాంగ మంత్రికిగల అధికారములను పురస్కరించుకొని, నీటిపారుదల బందోబస్తుగా జరుగుట కట్ట నియామకము చేయవలసిన సందర్భములు కలవని మారాజ్యాంగమంత్రికి తోచినచో మాగవర్నరు తన రాష్ట్రీయ

లోని నీటిపారుదల వ్యవహారములను గూర్చిన అంశము లెల్ల తానుతెలిసికొనుచు అవసరమైనచో గవర్నరు జనర లుకు నివేదింపవలెను.

15. " రాజ్యాంగచట్టములో పూర్తిగా మినహాయింప బడిన ప్రదేశముల పరిపాలన విషయములోను అల్పసం ఖ్యాకుల న్యాయమైన హక్కులను సంరక్షించు విషయము లోను గవర్నరున కివ్వబడిన ప్రత్యేక బాధ్యతను పురస్క రించుకొని అధికారములను చలాయించుటలో ఆప్రదేశ వాసుల పట్లనుగాని లేదా ఇతరచోటులలోని అనాగరిక జనులపట్లను తనకుగల బాధ్యతను నిర్వహించుటకు అవస రమని తోచినచో వారి అవశ్యకతలను తనకు తెలియపరుప గలందులకును వారిక్షేమము నిమిత్తము చేయవలసిన కార్య ములను గూర్చి తనకు సలహానిచ్చుటకును ఒకఉద్యోగిని గవ ర్నరు నియమించవలెను.

15. (ఎ) పశ్చిమోత్తరసరిహద్దు పరగణాలో సరిహద్దు జాతుల విషయములో గవర్నరు, గవర్నరుజనరలుకు ఏజంటుగా వ్యవహరింపవలెను. ఈవ్యవహార నిర్వాహణములో ఇతర వ్యవహారములెట్టి ఆటంకము కలుగనియ్యకుండ చూ చుట కేమాత్రము వెనుదీయరాదు."

శాసన నిర్మాణసంస్థలకు సంబంధించిన విషయములు:

16. "తన స్వతంత్ర వివేచన నుపయోగించి అవసరమని తోచినచో శాసనసభ తీర్మానించిన చిత్తుచట్టమును ఆమోదింపక పోవుటకు మాగవర్నరుకుగల సామాన్యాధికారమునకు భంగములేకుండా అట్టి, చిత్తుచట్టములను మాపేరున ఆమోదించుటలోను ఆమోదింపక పోవుటలోను గవర్నరు ఆచిత్తుచట్టములందలి నిబంధనలు తన ప్రత్యేక బాధ్యతలకు సంబంధించియున్నవా అను అంశమును జాగ్రత్తగా గమనింపవలెను.

17. "చిత్తుచట్టములను మాగవర్నరు జనరలుయొక్క ఆలోచనకొరకు నిలుపుదల (రిజర్వు) చేయుటకుగల సామాన్యాధికారమునకు భంగములేకుండా మాగవర్నరు ఈక్రింద చెప్పబడిన విధమున అన్ని చిత్తుచట్టములను తాను ఆమోదింపక విధిగా మాగవర్నరు జనరలుయొక్క ఆలోచనకొరకు నిలుపుదల చేయవలెను.

(అ) "బ్రిటీషు ఇండియాకు వర్తించు పార్లమెంటు చట్టమును రద్దుపరచునట్టి లేదా ఆచట్టముయొక్క విధులకు విరుద్ధమగునట్టి చిత్తుచట్టము.

(ఆ) "రాజ్యాంగము చట్టమునుబట్టి హైకోర్టువారికి ఏ అధికారస్థానమొసగబడినదో ఆస్థానమునకు భంగము కలిగించునట్లుగా దానిఅధికారములను తొలగించు చిత్తుచట్టము.

[ఇ] "ఒక చిత్తుచట్టము ఈ రాజ్యాంగచట్టములోని [illegible] భాగముయొక్క 3వ ప్రకరణము (అనగా బ్రిటీషువారి శాశ్వతహక్కులకు భంగము కలిగించునట్టి విచక్షణాయుత చర్యలు) యొక్క ఉద్దేశములకును, 299 వ శక్షను * యొక్క ఉద్దేశములకు భంగకరమగునా కాదా అని అనుమానము కలిగినచో గవర్నరు అట్టిచిత్తుచట్టమును నిలుపుదల చేయవలెను.

(ఈ) శాశ్వత పై వలె [పర్మనెంటు సెటిల్మెంటు] యొక్క స్వభావమును మార్చుచిత్తుచట్టమును కూడ నిలుపుదల చేయవలెను. అయితే ఒకచిత్తుచట్టమును ప్రవేశపెట్టుటకు ముందుగా గవర్నరు అనుజ్ఞపొందవలసిన నిబంధనయున్నచో ఆదేశ పత్రములోని ఈ ఉపపరిచ్ఛేదములోని నిబంధనలకు పురస్కరించుకొని అట్టిచిత్తుచట్టము ప్రవేశపెట్టకుండా

* 299 వ శక్షను:- 'లా ప్రకారము తప్ప నిర్బంధముగా [illegible] ని ప్రభుత్వము ఆశపరచుకొనరాదనియు అట్టి నిర్బంధ భూసంపాదన [illegible] కు తగినవష్ట పరిహారమివ్వబడుటకు తగు సదుపాయములు చేయవలె [illegible] ఉపయోగము నిమిత్తము నిర్బంధభూసంపాదన [illegible] చేయుటకు ఫెడరలు రాష్ట్రీయశాసనసభలకు అధికార [illegible] ఒకభూమిని [illegible] చేయుట (Public [illegible] ship) [illegible]

ముందుగానే అట్టి అనుజ్ఞను నిరాకరింపవలసిన పనిలేదని మా ఉద్దేశము.

18. "శాంతిభద్రతలకు తీవ్రమైనఅపాయము కలుగకుండా కాపాడుటకని-శాసనసభలో ఒక చిత్తుచట్టము, దానిలోని పరిచ్ఛేదము దానినిగూర్చిన సవరణలకు సంబంధించిన గ్రంథమును అచ్చువేయుటకు మాగవర్నరుకుగల ప్రత్యేక బాధ్యతను చలాయించుటలో ఆచిత్తుచట్టము ఉపపరిచ్ఛేదము సవరణలను బహిరంగముగా చర్చించినంత మాత్రముననే శాంతిభద్రతలకు భంగము కలిగింపునని అతనిబుద్ధికి తోచినతప్ప ఆయధికారము చలాయించరాదు.

19. "కొంతమంది సభ్యులను లెజిస్లేటివు కవున్సిలులోనికి నియమించుటకు గవర్నరుకుగల అధికారమును పురస్కరించుకొని ఎన్నికలలో ప్రాతినిధ్యమునందు కలిగిన హెచ్చుతగ్గులను ముఖ్యముగా ఆసభలో స్త్రీలకును షెడ్యూల్డు తరగతులవారికిని ప్రాతినిధ్యము కలిగించుటకు నుపయోగింపవలెను.

20. "మంచిపరిపాలన పద్ధతులను నెలకొల్పుటకును, దేశప్రజలలో న్నితరగతులవారియొక్క నైతిక సాంఘిక ఆర్థికక్షేమమును పెంపొందించి ప్రజాజీవనమందు రాష్ట్రపరిపాలనమందు వారు ఆస్థానమునుపొందుటకు వారికి శక్తి కలిగించుటకును అన్నితరగతులవారియందు మతములవారి

యందు సద్భావమును సహకారమును కలిగించుటకు ఒండొరుల మతాభిప్రాయములపట్ల చిత్తవృత్తులపట్ల పరస్పరమర్యాదను కలిగించుటకు ప్రయత్నించవలెను. శాసన నిర్మాణ విషయములందును పరిపాలన విషయములందును గవర్నరు కివ్వబడిన అధికారములను చలాయించుటలో ఈప్రజ్ఞాపనమును గవర్నరు జాగ్రత్తగా గమనింపవలెను.

21. "ఈనిర్దేశపత్రములోని ప్రజ్ఞాపన విషయములను గవర్నరు తనమంత్రులకు తెలియపరచి తనకుతోచిన విధముగా తన రాష్ట్రములో ప్రచురపరుపవలెను."



సౌభాగ్య ప్రెస్, బెజవాడ.

భీమావీజంట్లకు, వైద్యులకు, గ్రంథకర్తలకు, ఉపాధ్యాయులకు ఎల్లప్పుడు చేత నుండవలసిన అమూల్యగ్రంథము.'

## అ భి ప్రా య ము లు.

"ఈ కాలములో నిట్టినిఘంటువు అత్యవసరమని అత్యుపయోగమని వేఱుగ వ్రాయనక్కఱలేదు. శివరావుగారీమహాప్రయత్నమును నెఱవేర్చినందులకు వారిని కర్తింనుచున్నాము. మేము చూచినంతవరకు కొన్ని కొన్ని గొప్పవిషయములకు వీరు కడు తేలికయర్థముల నొసంగినారు. చివరవరకు సామాన్యవశ్యమగు మార్గమెద్దియాయను నాదర్శముతో పనిచేసినారు. కొన్ని యర్థముల నొసంగుపట్ల స్వకపోలకల్పనాశక్తిని ప్రదర్శింపక వ్యవహారమును విడక, పాటించి, దానినే నిరూపించినారు. పలుగ్రంథముల దరచి యీ నిఘంటువును గూర్చినారు. వీరు కావించిన మహాకృషికి తగిన ప్రోత్సాహము లభించుగాక." —ఆంధ్రపత్రిక - 25-7-36.

'ఇంగ్లీషు తెలుగు తర్జుమాల యవసరముగల ప్రభుత్వశాఖలందలి అన్ని కార్యాలయములయందును గ్రంథాలయములయందును ఇతర సంస్థలయందును ఇది అత్యంతావశ్యకమగు ననుటకు సందియము లేదు.' —హిందు.

"కోర్టులు, రాజకీయములు, శాస్త్రీయవిషయములకు సంబంధించిన అనేక పదములకు అర్థములు వ్రాయబడినవి. వ్యవహారస్థులకు, దేశసేవకులకు, విద్యార్థులకు వ్యాసరచయితలకు, దీనివలన గలుగు ప్రయోజనము లనంతములు. ఆంధ్రభాష కిది అమూల్యభూషణము. విద్యాధికు లనేకుల ప్రస్తుతు లందినది. పాఠ్యగ్రంథనిర్ణయ సభవారిచే గ్రంథాలయోపయోగ నిమిత్త మంగీకరింపబడినది". —గృహలక్ష్మి, మార్చి 1935.

'విద్యార్థులకేగాక ప్రచారకులు, లేఖకులు, పత్రికాసంపాదకులు మొదలగు వారికెల్ల జాల నుపయోగముగ నుండగలదు'. —కృష్ణాపత్రిక,

'వ్యవహారపరులేకాక కేవలము భాషాభిమానులును, దీనివలన గొప్ప ప్రయోజనములు పొందగలరు'. —భారతి.

"అత్యంతోపయుక్తమగు ప్రచురణము"—సర్ వేపా రామేశంగారు.

"చిరకాలమునుండియున్న కొరత నిది తీర్చుచున్నది." —సర్ అల్లాడి కృష్ణస్వామిగారు. అడ్వొకేటు జనరల్.

## దిగవల్లి వేంకటశివరావుగారి ఇతర పుస్తకములు.

# అధినివేశస్వరాజ్యము

విజ్ఞానచంద్రికలోని 40 వ గ్రంథము.

బ్రిటిషుసామ్రాజ్య స్వరూపస్వభావములు, స్వరాజ్యసమస్యలు, స్వరాజ్యప్రయోజనము. అధినివేశస్వరాజ్యచరిత్ర, ఆయా దేశముల రాజ్యాంగ విధానము, ప్రజాప్రభుత్వ ప్రాతినిధ్యపద్ధతులు, కెనడా డొమినియను, ఆస్ట్రేలియా కామన్వెల్తు, ఐరిషు ఫ్రీస్టేటు, ఆంగ్లరాజ్యాంగములను గూర్చి చర్చించు రాజ్యాంగశాస్త్రగ్రంథము. నూతన ఇండియా రాజ్యాంగచట్టములోని మంచిచెడ్డలు గ్రహించుట కిది తోడ్పడగలదు. వివిధ దేశ ప్రజల ఆర్థికస్థితిగతులు ప్రభుత్వాదాయ వ్యయపద్ధతులు పోల్చిజూపు స్థితిగతి లెఖ్ఖలజాబితాలు 36 కలవు. "అధినివేశ స్వరాజ్యము ప్రపంచ రాజకీయములను గూర్చిన ఉత్తమ గ్రంథ"మని హిందూపత్రిక ప్రశంసించినది. దీని ప్రాశస్త్యమునుగూర్చి ఆంధ్రపత్రిక 2-9-33 తేదీన సంపాదకీయవ్యాసమును ప్రచురించినది.

250 పుటలు. వెల రు 0—12—0

**దక్షిణాఫ్రికా:**—దేశచరిత్ర. వలసకేగిన భారతీయుల చరిత్ర; గాంధి మహాత్ముని సత్యాగ్రహ చరిత్ర. 432 పుటలు 2—0—0

**అంకుల్ టాము కథ:**—అమెరికా దేశపు హరిజనులనదగు నీగ్రోబాని సల ఘోర స్థితిగతులను గూర్చినకథ. 34 పుటలు 0—2—0

**భారతదేశ స్థితిగతులు:**—వివిధదేశ ఆర్థిక స్థితిగతిలెక్కలు; భారత దేశ దుస్థితి, ఆదాయవ్యయములు. 72 పుటలు 0—2—0

**ఆంగ్లరాజ్యాంగము:**—ఇంగ్లీషు పార్లమెంటు రాజ్యాంగ స్వరూప స్వభావములు. 30 పుటలు. 0—1—0

'వ్యవహారకోశ' శేషము 0—4—0

# సహకారవస్తునిలయోద్యమము

## భారతదేశ స్థితిగతులు

గ్రంథాలయములం దుంచుటకు మద్రాసు టెక్స్టుబుక్కు
కమిటీవారు ఆమోదించినారు.

(ఫోర్టుసెంట్‌జార్జి గెజెట్ సప్లిమెంటు, 2-6-36 పుట 118).

ఇది దేశీయ దేశాంతర సహకారోద్యమమును అందుకుసంబంధించిన సమస్యలను విపులముగాచర్చించు ఉత్తమ అర్థశాస్త్రగ్రంథము. రాక్డేలు సహకారోద్యమచరిత్ర, సహకారోత్పత్తి, కృషి, పరిశ్రమ, వ్యాపారములు, ప్రజారోగ్యము, విద్యనభివృద్ధిచేయగల సహకారపద్ధతులు, భారతదేశ ప్రజాజీవనము, పారిశ్రామికాభివృద్ధి, గ్రామపునర్నిర్మాణములను గూర్చిన ప్రకరణములు నిందుగలవు. మన ఆర్థిక స్థితిగతులను ప్రభుత్వాదాయ వ్యయపద్ధతులను ప్రపంచములోని ఇతర దేశములవానితో పోల్చిచూపు స్థితిగతిలెక్కలును మన దుస్థితిని తొలగించుమార్గములను సూచించు వ్యాఖ్యానములును "భారతదేశ స్థితిగతులు" అను 72 పుటల అనుబంధమునుగలవు. ఇది కృష్ణాజిల్లా కో-ఆపరేటివ్ ఫెడరేషనుచే ప్రకటింపబడినది. 260 పుటలు.

సాదాబైండు వెల రు 1—0—0. క్యాలికోబైండు వెల రు 1—4—0.

---

బసవరాజు అప్పారావు గీతములు:—200 పుటలు 0—8—0

వలయువారు:-దిగవల్లి వేంకటశివరావు బి. ఏ., బి. యల్., బెజవాడ.

ఏ. జి. ప్రెస్, బెజవాడ.